# పాదుకాపట్టాభిషేకము



పప్పు సూర్యనారాయణ





పబ్లిషరు

రాజమహేంద్రవరము

కొండపల్లి వీరవెంకయ్య

శ్రీ సత్యనారాయణ బుక్కు డిపో.

రాజమహేంద్రవరమున

శ్రీ చింతామణి ప్రెస్ నందు ముద్రితము.

1932

వెల రు 0-12-0

# రామదాసు.

గ్రంథకర్త:—బళ్లారి ధర్మవరం గోపాలాచార్యులు

ఆంధ్రదేశమున మహాభక్తుడని రామదాసని ఖ్యాతిగాంచిన కంచర్ల గోపన్న చరిత్రము మృదుమధురశైలిలో నాటకరూపమున వ్రాయఁబడినది. ఆంధ్రనాటకసమాజము లన్నియు రసవంతముగు నీనాటకముచే ప్రదర్శించుచుండుటవలన దీని ప్రాశస్త్యము వేరుగా వివరింపనక్కరలేదు ఇందలి పద్యరత్నములు కొన్ని గ్రామఫోను ప్లేటులలోఁగూడ పాడఁబడినవి. వెల రు 1—0—0

# కృష్ణలీల

బళ్లారి పండిత కే. సుబ్రహ్మణ్యశాస్త్రిగారి విరచితము.

ద్వారకాపురాధీశుఁడగు, శ్రీకృష్ణుని జననము, కంసనంహారము, పూతనా సంహారణము, కాళీయమర్దనము, శకటాసురవధ, విశ్వరూప ప్రదర్శనము, గోవర్ధనోద్ధరణము మున్నగువానితో కృష్ణలీలలు వర్ణింపఁబడినవి ఒక్కొక్కపద్యము వేయివరహాలు విలువచేయును. వెల రు 1—4—0

# రాధాకృష్ణ

గ్రంథకర్త:—పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు

ఈనాటకము గోపికల శృంగారప్రియులకు శృంగారము భక్తులకు భక్తిరసము వేదాంతులకు సుజ్ఞానబోధయునగును కృష్ణునివేణు చెవికాడను గోపికల సల్లాపసంగములు వినిన, జన్మకాలమున వచ్చిన పాపమైన నశించును వెల రు 0—12—0

# విప్రనారాయణచరిత్ర

గ్రంథకర్త:—పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు

హిజ్ మాష్టర్సు వాయిస్ గ్రామఫోను కంపెనీవారిచే బహుకరింపఁబడిన రంగమార్తాండ కపిలవాయి రామనాథశాస్త్రిగారిచే నటింపబడి, జగత్ప్రఖ్యాతి గాంచిన భక్తిరసభరితమగు నాటకరాజము. దేవదేవి శృంగారప్రసంగములు, శ్రీనివాసుని అమాయకత్వము-వేశ్యమాత హడావిడి చవిచూడదగినవియౌను. వెల రు 1—0—0

# సారంగదర

పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు వ్రాసినది

నవరసములందు ప్రధానమైన శృంగారరసము నీతితో సమ్మేళన మొనర్చి వ్రాయఁబడిన నాటకము నవరసోజ్జ్వలములగు పద్యములతో విలసిల్లుచున్నది. ఆంధ్రనటులు ప్రదర్శించునదీ నాటకమే. వెల రు 0—8—0

---

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణబుక్కుడిపో. రాజమండ్రి

ఓం.

# పాదుకాపట్టాభిషేకము.

కృతికర్త-

పప్పు సూర్యనారాయణ

(విజయనగరం) రాజాం.



మొదటికూర్పు ౧౦౦౦ ప్ర

ప్రకాశకుడు -

కొండపల్లి వీరవెంకయ్య

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి.

శ్రీ చింతామణి ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.

రాజమహేంద్రవరము.

వెల రు. 0-12-0

# కృతిసమర్పణము.

## శ్రీరామపాదుకాపట్టాభిషేకము.

దీనిని

నాకు జనకులును

పండితమాన్యులును

కీర్తిశేషులును

అగు

## బ్రహ్మశ్రీ పప్పు వెంకటశాస్త్రిగారి

ఆత్మకు

సమర్పించి

పితృఋణవిముక్తుడనగుచున్నాను

# ఈనాటకమునందు వచ్చుపాత్రలు

## పురుషులు

దశరథుడు

రాముడు

లక్ష్మణుడు

భరతుడు

శత్రుఘ్నుడు

బ్రహ్మ

వశిష్ఠుడు

సుమంత్రుడు

గుహుడు

## స్త్రీలు

సీత

సరస్వతి

కౌసల్య

కైక

సుమిత్ర

మంథర

యింకనూ సందర్భానుసారముగా ఋషులు బ్రాహ్మణులు సేవకులు మొదలగువారు వత్తురు.



శ్రీ

# శ్రీరామపాదుకాపట్టాభిషేకము.

ప్రథమాంకము — ప్రథమరంగము.

## సత్యలోకము.

సుఖాసీనులై వాణీకమలాసనులు ప్రవేశము.

వాణి — ప్రాణేశ్వరా! దివిజలోకమునకీ దశకంఠునివలన కలిగెడు దుర్దశ తొలంగెడు ప్రాప్తమెప్పుడు లభించును.

బ్రహ్మ — శర్వాణీ! రాముడు కల్యాణరాముడైనాడు. నేటికి వాని శ్రీరామనామము సార్థకమైనది ఇక రావణవిరాముండై సుత్రామాదిదివిజులయొక్కయు ఆశ్రమవాసులయొక్కయు బాధల నడంచును. తొందర చెందనేల?

(ప్రవేశము - సేవకుడు)

సేవ — దేవా! జయము జయము.

బ్రహ్మ — ఏమి విశేషములు.

సేవ — ఏలికా! ఇరువురు ఋషీశ్వరులు తమదర్శనార్థమై ద్వారంబున వేచియున్నారు.

బ్రహ్మ — పోయి వారిని లోనికంపుము.

సేవ — చిత్తము. [అని నిష్క్రమించును.]

బ్రహ్మ—మునీశ్వరుల రాక కలదెయ్యది యోకదా!

నర—కలదువకేయున్నది. "యజ్ఞయాగముల గావింతుము. దూదరందని యాహ్వానించుటకై యుందురు.''

బ్రహ్మ—దానికివారు వ్యయముగరానేల. మంత్రములు లేవా.

నర—కానిచో రాక్షసబాధానివారణోపాయ మెఱుంగుటకో

బ్రహ్మ—రాక్షసలోకమారకుడవ్వదేదన్నింది

గీ. గాధినందనుక్రతువును గాచుకొఱకు
తాటకిన్ద్రుంచి మారీచు దరిమెతుదకు
పరశురాముని తేజంబు బడయుకొఱకు
గర్వభంగంబు గావించె ఘనత మెరయ.

రామావతారరూపమందు ప్రథమరంగమారంభమైనది. క్రమక్రమముగా తక్కినరంగములు వచ్చును. ఇంతలోవీరు తొందరజెందనేల.

(ప్రవేశమిరువురు ఋషులు)

ఋషు—జయము, కమలాసనా, జయము శార్వాణీ! నీకు శుభమగుగాక.

బ్రహ్మ-
నర- } ఋషీశ్వరులారా! అభివందనము.

ఋషు—అభ్యుదయపరంపరావాప్తిరస్తు.

బ్రహ్మ—[ఆసనములజూపి] మహాత్ములారా! మీరిట దయచేయుడు.

(ఋషులాసీనులగుదురు]

బ్రహ్మ—మౌనిశేఖరులారా! మీకు కుశలమా! మీయజ్ఞ తపంబులు నిర్విఘ్నముగా సాగుచున్నవా.

1. ఋషి—చతురాననా! మాదురవస్థలను, పలలాశులగు

రక్కసులవలన మాకు కలుగుచుండెడి బాధలను, పూర్తిగా నెరింగిన వాడవయ్యు మిన్నకుండుట న్యాయమా!

2. ఋషి — పద్మసంభవా! మునిజనహింసకులగు దనుజులెల్లరును మంటలో గలియవలయును. సురాపాన నిరతులైన సురలెల్లరు నసురుల పీడవలయును. రాక్షసకుల మహావృక్షము కూకటివేరుతో పీకి వేయ బడవలయును. లోకకంటకుడగు దశకంఠుడు నామావశేషుడు గావలయును. అప్పుడు మా జపతపములు నిర్విఘ్నముగా సాగును. మే మొనరించు హవిర్భాగములు మీవరకు వచ్చును. మా కాపాట మునశించును. శుభములు కలుగును.

2 ఋషి — వాణీమనోహరా! క్రూరకర్ములైన రక్కసులు రావణప్రేరితులై, బిరుసుమ్రాకులూని వెంటుచు, జటాళికి నిప్పంటించుచు, నారగోచులు దిగలాగుచు కాషాయాంబరంబుల కసపొట్టించుచు, మేఖలల జిల్చి యజ్ఞోపవీతంబుల దెంచి పారవైచుచు, కమండలంబులు వంకలవలగావించుచు, పటకుటీరంబుల భస్మపటలంబు సేయుచు మాకెంతేని కష్టంబుల గల్పించుచుండ కుశలమెట్లు కలుగును.

బ్రహ్మ — ఋషీశ్వరులారా! మీరీ బాధలన్నిటికి లోనగుచున్నారని మేమిదివరకే యెఱుగుదుము. మీకీ కడగండ్ల దప్పించుటకును, దేవలోకవాసులకు దేవారాతివలన భయంబు వాపుటకునై గదా, ఆదివిరాట్స్వరూపుడగు నా వైకుంఠవాసుడు దశరథరాజనందనుడై యవతరించెను.

2 ఋషి — నీలమేఘశ్యాముడగు రాముడు జన్మించినాడు. అతడు వనమాల ద్రిమ్మరి రాక్షససంహారము గావించి మమ్ము బ్రోచునని మేమింతదనుక ధైర్యముతో నుంటిమి కాని యిప్పుడు మా యాశలన్నియు నిరాశలైనవి మాకీ బాధలు శాశ్వతములట్లు గాన్పించుచున్నవి.

బ్రహ్మ—ఇప్పుడేమైనది?

2. ఋషి—ఏమైన కొంపమునుగునో అది యేమైనది. శ్రీరామచంద్రునకు రేపు పట్టాభిషేకముగానున్నది. సర్వము సిద్ధమైనది.

బ్రహ్మ—రాముడు పట్టాభిరాముడగుట మనకెల్లరకును సంతోషదాయకమేగదా! ఇందుకు మీరు విచారించుచున్నారేల.

1. ఋషి—ఈకార్యము రామునికి సంతోషదాయకమేగాని మనకు ముఖ్యముగా విచారకారణము, అనర్థదాయకము, అశుభసూచకము, అప్రస్తుతము.

బ్రహ్మ—ఋషివరా! మీమాటలు నాకర్థము కాలేదు.

2. ఋషి—అర్థమగుటకేమున్నది. గాథకావ్యములా లేక శైవవాక్యములా? రాముడరణ్యమునకువచ్చి గహనమున వనవాసము చేసి లోకవిద్రావణుల బరిమార్చి, దివిజలోకమునకెల్ల క్షేమము సాధించునని కొండంత కోరికబెట్టుకొని, తమలోకంబుల విడచిపెట్టుకొని, స్వస్వరూపంబులపోనాడి, స్వసుఖంబును జెంగనాడుకొని భూలోకంబునకువచ్చి యరణ్యవాసంబొనరించుచు, మర్కటరూపంబున సంచరించుచు, కాయగసుగుల భక్షించుచు, శ్రీరామచంద్రునిరాకకై నిరీక్షించుచు, కిష్కింధావనప్రాంతమందు దివిజులెల్లరు కాలక్షేపము చేయుచుండగా, ఇటనయోధ్యలో రాముడు రాజ్యాభిషిక్తుడై భోగలాలసుడై సుఖంబుండిన వారికేదిగతి. దేవతాలోకమునకు మేలొనగూడు మార్గమెయ్యది?

బ్రహ్మ—రాముడభిషిక్తుడై రాజదండంబును చేబూనిన యుత్తరక్షణమునుండియు, దుష్టశిక్షణ శిష్టరక్షణములకే కడంగును గాని తక్కినరాజులవలె భోగలాలసుడు కానేరడు. రాక్షసవధోద్యోగంబునకు కడంగితీరును. సంశయింపబనిలేదు

1. ఋషి—ధాతా! ఏలనీకీవెర్రి! రాముడొకవేళ ధర్మపక్షపాతియై దుష్టశిక్షణమునకు కడంగునేయనుకొందము. అట్లు కడంగిన

సర—ఋషివర్యా! చుట్టరికముగ నాపై నీకుట్టపడకై యెదకేల యింతకును నామనస్సొప్పదు. ఏలనందురా? నాకు చేతగాక కాదు. అవలీలగా నెరవేర్పగలను. కాని నేనీకార్యమును గావించుటవలన కౌసల్యకైకలిద్దరుతప్ప, అయోధ్యలో తక్కినవారా బాలలతో పాలనము శోకింతురు. ఆనందవార్ధి నోలలాడుచున్న వారి మనస్సుల నొక్కత్రుటిలో శోకసాగరనిమగ్నంబుల జేయుటకు సామర్థ్యమున్నను నాయంతరాత్మ సాహసింపజాలకున్నది. కావున నన్నింతకు ప్రేరేపింపవలదు.

బ్రహ్మ—లలనా! అజ్ఞానవానవు కై యాదివిరాట్స్వరూపు నెన్నదగని శోకింపకుము. రాముడు లీలామానుషవేషధారియు చిద్విలాసుండును నీవెరుంగుదువు భగవంతుడు భూభారవతరణార్థ మవతరించినపుడు పలుబాధలనందుటకు సిద్ధపడియే యుండును. తదన్యుల శోకముతో మనకు బనిలేదు. దేవహితమును నెరవేర్పుట నీకు లెస్సయని నాయుద్దేశము.

సర—ప్రాణేశ్వరా! తమయాజ్ఞను శిరసావహించెదను. ఈక్షణముననే సాకేతపురమునకేగి సఫలీకృతమనోరథనై తిరిగివచ్చెదను. మంథర నిందుకు మధ్యవర్తినిగా జేసి కార్యసాఫల్యఫలమును మీకు కల్పించెదను.

ఋషి—తథాస్తు, తథాస్తు.

బ్రహ్మ—ఋషులారా! ఇక మనము పోవుదము.

(అందరు పోవుదురు, తెరజారును)






### ద్వితీయాంకము — ప్రథమరంగము — రాజమార్గము.

తొందరగా మంథర ప్రవేశించి.

### అనుబంధము 1

ఏమి! యీవైభవము! ఏలనీయాందోళనము!! ఎందుకీగందరగోళము!!! పౌరులతిరయంబున పరుగులిడుచున్నారు. అలంకారులతిఝుంకారముతో బలిచేయుచున్నారు. అలంకరింపులు కన్నులకింపుజనింపజేయుచున్నవి. జనులయానందమునను మేరలేకున్నది. ప్రజలాబాలగోపాలము రామదాసుస్మరణమే గావించుచున్నారు, భజనపరులు రామునే భజించుచున్నారు హరిదాసులందందు రాముని చరిత్రము నే యుపన్యసించుచున్నారు. నాట్యశాలీ రామకథనే రూపకముగా కేళిగాని యభ్యసించుచున్నారు. వందిమాగధులు రాముని స్తుతించుచున్నారు. నేడయోధ్యయంతయు రామమయమైయున్నది.

పురమున నేవరు ననుగాంచినను తెల్లబోడలే! ఏయింటిముందు జూచినను వేయనటికంబములే. ఏవీథులందు బోవగాంచినను మాల్యంపు ముగ్గులే. ఇంటింట గుమ్మములకు పచ్చలతోరణములే. ఏసందులందైనను రంగురంగుల విద్యుద్దీపములే గాన్పించుచున్నవి. వీథులయందు చల్లబడిన పన్నీటివాసన వేయికోసులమేరకు గుప్పుచున్నది. వెలుగుచున్న విద్యుద్దీపముల కాంతి యాకసంబునంటుచున్నది, ప్రతియింటను జనులు కలకలలాడుచున్నారు.

## ద్వితీయాంకము—ద్వితీయతరంగము.

కైకయొక్క యంతఃపురము.

ప్రవేశము సుఖాసీనయై కైక.

కైక—నేడేలొకో మాకోటలో కొంతయలికిడి జరుగుచున్నది. ఎన్నడుతీయని జవాహిరీలుసైతము తీయించుచున్నారు. కారణమేమొ చెపుమా!

[ప్రవేశము మంథర]

మంథ—అమ్మా! ఇంకను నిదురింపలేదా!

కైక—మంథరా! వచ్చితివా! నీకొరకే యెదురుచూచుచుంటిని. నిదురించుటమాటకేమిగాని యాందీసంగతి జెప్పుము, మనకోటలో నేడేని గొప్పయుత్సవము జరుగునున్నదా యేమి?

మంథ—ఎంతసంగనాదివమ్మా! ఏమియు నెరుగనట్లు మాటలాడుచున్నావు

కైక—ఒట్టు నాకేమి తెలియదే! ఏదో పెద్దగడబిడవలెనే గాన్పించుచున్నది. ఇందుకు కారణము నీ వెరుంగుదువేని నాతో చెప్పరాదటే

మంథ—ఏమున్నదమ్మా! చెప్పుటకు, వినుటకు రేపునీసవతియగు కౌసల్యాదేవియొక్క కుమారునకు నీభర్తగారు యౌవరాజ్యాభిషేకముగావింప నిశ్చయించినారు. అందులకే యీసందడి జరుగుచున్నది.

కైక—ఏమి! రాముయుతండ్రికి రాజ్యాభిషేకమా!

గీ. చిన్నిరామునకభిషేక మున్నవార్త
వినినవ్రుతంపుసోనయై చెలగనమ్మ

యిల్లాలవ్వ డెంతమురిపెముతో సాగుచున్నదో నటిప్పు కార్యమును నీనాధునిచేత చేయించుకొనుము.

కైక—ఏమది.

మంథ—రేపటి యభిషేకము రామునికిగాక నీతనయునికొ గునట్లు నీకు వశీకృతుడని నీవు నమ్మియున్న నీపతిచేత చేయించు కొనుము.

కైక—ఆ! ఆ! మంథరా! నీ కొంకరూపమందే కాదు బుద్ధి యందుకూడ వక్రత కలదనుకొనుచుంటిని. రాముడెల్లరికన్నను నాకు రా ముడెక్కువ ప్రియుడు. ఒక్కనవారికి కొన్నివ్యక్తులకు మాత్రమే యను రాగముగల్గినవాడు కాదు సర్వజన ప్రియుడు. వానిని ప్రేమించ నివారీలోకంబున నెందును లేరు. అట్టిరామునకు మత్స్యలవార్ధిసోద సభ నిలుపబడిన యభిషేకము విఘ్నముగావించి, న్యాలాభాషేకుక రాలివలె, ధర్మమార్గానువర్తి నిమాడిక్క, జ్యేష్ఠునివిడ చి రెండవవానిని యువరాజ్యాభిషిక్తునిచేయవలయునని భూపతిని వేడవలయునా.

మంథ—అమ్మా—! జ్యేష్ఠుడనంత శ్రేష్ఠుడాయేమి రాముడు రాజైనచో పరిస్థితులెట్లుమారునో యించుకయాలోచించినచో నీవిట్లన వలదన్నకము. నీనాధుడిప్పుడే జరాభారపీడితుడగుచున్నాడు. అందులకే యీయువరాజ్యాభిషేకమును దలపెట్టినాడు. అతనికి ప్రాయముతో డనే నీయందలి ప్రేమకూడ తగ్గుచున్నది. దానికిప్పటిచర్యయే తా ర్కాణము సర్వరాజ్యాధికారమును రామునకొసంగి తాను తీరుబాటుగ విశ్రాంతిగొన నిశ్చయించినాడు. జనులెల్లరు రామరాజ్యమని తలపిం చుచున్నారు. ఇక నీగతి. నీకుమారునిగతి యేమగవలసినదేమున్నది.

కైక—మంథరా! రాముడు రాజైన మాకేలమునిగతికలుగును. వానికి తనజననియగు కౌసల్యయందుకంటె నాయందెక్కుడు ప్రేమ కలదు. నాకుమారుడు వానికి ప్రాణతుల్యుడు,

భవముతో మెలంగుచు, దశరథభూపాలునివలలో నైచుకొంటినని మఱియుచుండిన నీవే యొకరినీడ వసించుట కిచ్చగించి, సంతసించి, చంకలెగుర్గుద్దుకొనుచుండగా నేను వగవనేల? తల్లీ! రాముడు రాజైనచో మాకొంపలకు నిప్పువెట్టునా? భరతుడు రాజైనచో మాకు భవనములు కట్టించి యిచ్చునా? ఏమియు లేదు ఏ మహారాజు రాజైనను, ఏయమ్మ రాజమాతయైనను నాదొప్పుడు గంజియు నాదింకి చీరయు నాకు దప్పవు గదా! నాకేల యీకొరగాని శోష నేను బోయెదను. నగలు, నా సొమ్ము తీసుకో, అభిషేకానికి హాజరవుదువుగాని (పోవబోవును.]

కైక—పోకు! పోకు! మంథరా! నీవుచెప్పినవన్నియు నిజమే కాని రాముని నడవికిబంపి భరతుని రాజుచేయుట న్యాయముకాదా.

మంథ—అమ్మా! లేనిపోని నొక్కులు నీభాషాపాండిత్యం దాసీముండదగ్గర చూపించకు. కావున నీచేత సత్యము పల్కించినది. రాముని నడవికిబంపి భరతుని రాజుచేయుట న్యాయము. అన్యాయమెట్లగును. ఇంటనున్నవారిలో జ్యేష్ఠునిగదా యువరాజ్యమున కభిషిక్తుని చేయవలయును, రాముడడవికేగిన గలముగ్గురిలో భరతుడేగదా జ్యేష్ఠుడు అమ్మా! ఈ పనియందు నీవు శాంతినవలంబించి యూరకుండినచో మాకు, మీమాతాపుత్రులకు బాధ తప్పవు దీపముండగనే చక్కబెట్టుకొనుట మంచిది. దశరథునిహృదయము కౌటిల్యపూరితమని యెరుంగుటకు, అతని సంకల్పము నీకు తెలుపకపోవుట యొకటి, నీసుతుడూర లేనితరిని యీయభిషేకము సంకల్పించుట యొకటి యీరెండును తార్కాణములు గావా? ఇవి జాలవా? ఇంకనైనను నీవు మేల్కొనవా? మమ్ముల నుద్ధరింపవా? రాజమాతవై పేరుకొని గౌరవమును పొందవా? సవతియొక్క విజృంభణమును గాంచి చేతకానిదానివలె యూరకుందువా?

కైక—గీ. మంధరా నాదుమేల్కోరు సుందరదన
సమ్మతంబయ్యె నీబోధ చాలఁగాని
యేదిమార్గంబు భూపతి నేమించు
కేడవలయునో దెల్పుమా వీనులలర.

మంథ—అమ్మా! ఉపాయము జెప్పినతరువాత నన్ను మఱింత దిట్టెదవేమో? నాకేల యీ బాధ. మీరు రాజపత్నులు. ఇష్టమున్న విందురు. కష్టమైనచో కోపగించి మమ్ము తూలనాడుదురు. చేయిజారి వ్యర్థయనిపించుకొనుటయేల? నన్ను నీవనుపు నేఁబోయెదను.

కైక—మంధరా! చిల్లగిపెట్టి యెందుకు బోయెదవు? నీవు చెప్పినదంతయు నాకవగతమైనది. ఇప్పుడెట్లు లేదు? కుటిలస్వభావము నాకు పూర్తిగా వెల్లడియైనది. నీపల్కులు నిక్కములని నేను పూర్తిగా విశ్వసించితిని. సార్వభౌముని మోసపుచ్చి రేపటియభిషేకమునకు విఘ్న మాపాదింప సంకల్పించితిని. రామవనవాసము, భరతాభిషేకము యీరెండింటిని జరిగించితీరవలయునని దృఢముగ నిశ్చయించితిని. కావున ఓమంథరా! ఇకకాలయాపనము చేయక కార్యసాధనమార్గము నెఱింగింపుము. త్వరపడుము. రాజుగారువచ్చువేళ సమీపించుచున్నది.

మంథ—అట్లు దారికి రమ్ము. జ్ఞాపకశక్తి యెంతటి వారికి యుండును. సార్వభౌమునికి ముద్దులయిల్లాలవై తినని సంతసించినంతమాత్రమున సకలవిషయములను జ్ఞాపకముంచుకొనెడిశక్తి యులవడునా?

కైక—మంధరా! ఇంక నీయుపాలంబనములుమాని కార్యక్రమమునకు గడంగుము.

మంథ—అమ్మా! ఇందు కార్యక్రమమునకేమున్నది. మును శంబరాసురసంహారసమయంబున నీనాథుడు నీకు రెండువరముల నొసంగి యుండెనుగదా. వానిని నీవిప్పుడు కోరుకొనుము. అందొకటి రామునికి పదునాలుగేండ్లువనవాసము, రెండవది భరతునికి రాజ్యాభిషేకము

కైక—భళా! మంథరా! నీజ్ఞాపకశక్తికి సంతసించితిని. ఆవరంబుల నే వేడెదను. ఇక నీవు వెడలిపొమ్ము.

మంథ—అమ్మా! ఇంకకొంచెము చెప్పవలసియున్నది. సమయోచితముగా సరససల్లాపములాడి తరువాత తొంటిచేయిని చూపు స్వభావముగలవారు పురుషులు. అట్టివారిలో నీనాథుడగ్రేసరుడు. కనుక కార్యము నతిజాగరూకతతో నెరవేర్పవలయును. ఇంచుకంతయైనను నీవాతని కల్లబొల్లి యిచ్చకంపు పలుకులకు లొంగితివా కొంప మునుగుననుకొనుము. మున్ను కోరినవరముల నొసంగెదనని ప్రమాణము చేయించుకొని పిమ్మట వరములను వివరింపుము. లేనిచో కార్యము చెడును. గుండె రాయి చేసుకొనుము. హృదయ మీర్ష్యాపూరితము గావించుకొనుము. భూషణములనువిప్పి యలుకామందిరమున వసియింపుము, నాథునిచే ముందుగా ప్రమాణము గావించుకొనుము, పిమ్మట వరములను వివరింపుము. ఇందొక్కటియైనను క్రమానుసారముగా విడమరువకుము. నేపోయెదను.

కైక—అట్లే గావించెద, పొమ్ము. పోవునపుడు నేటికి విద్యుద్దీపముల నార్పివేయవలయునని కావలివారితో నాయాజ్ఞగా దెల్పుము.

మంథ—మంచిది, ముందు వరద్వయస్వీకరణ, తరువాత వర వివరణ. ఈవరుసమాత్రము మరువకుమా (పోవును).

కైక—ఇక నేనేగి నాప్రయత్నమున నుండెద.

(కైక పోవును - తెరవాలును)

## ద్వితీయాంకము-తృతీయరంగము-కైకేయీ మందిర ప్రాంగణము.

(కైకను వెదకుచు దశరథుడు)



దశ—ఏమిది.

గీ॥ ధరణిధవునేయి ఒకిలేని । ధరణికరణి
నరయ శారికలేని పం । జరము వరుస
పతినిగోల్పోయి కళతప్ప । నతివకరిని
కైకలేకుంట నీయింట । కాంతిలేదు॥

(తెరలో) ఏలికా! దేవిగారలుకయింట శయనించియున్నారు.

దశ—అన్నన్నా! ప్రమాదముసంభవించినది, పోయి యూపె కోపకారణమెరింగి యలుకదీర్చి యభిషేకోత్సవావశ్యకోచిత వస్త్రాలంకారభూషితురాలుగానొనర్చి మంటపభూమికి గొనిపోవలయును.

(వెనుక తెరయెత్తగా అలుకగృహంబున కైక)

దశ—(కైకనుసమీపించి) కేకయరాజపుత్రీ!

కైక—[పలుకక యూరకుండును]

దశ- గీ॥ జీర్ణచేలము నీమేన । జేర్చనేల
కటికినేలను శయనింప । గడగనేల
అలుకగృహమున నీవిట్లు । వలుగనేల
పలుకుమునిబిల్వపల్క నీ । యలుకయేల॥

కైక—(యూరకుండును)

దశ- గీ॥ చెలియ! రామాభిషేకంబు । వెలుగువేళ
డెందమందున చింతతో । గుందనేల
క్రొంచెమైనను జాగైన । మించువేళ
రమ్ము లేలెమ్ము కేకయ । రాజబాల॥

అనుబంధము 4.

కైక-అట్లయిన శంబరాసురసంహారపుకథ మీకు జ్ఞాపకమున్నదా

దశ—ఆకథ జ్ఞాపకముండుటయే కాదు. నాడునీవు నాకుచేసిన సహాయము నెన్నటికిని మఱువజాలను. అప్పుడు నేను నీకు రెండువరంబులొసంగితిని. వానిని నీవు నీయిచ్చవచ్చినపుడు కోరుకొనెదనంటివి,

కైక—జ్ఞప్తియున్నదిగదా! ఆరెండువరములే యిప్పుడొసగవలయును

దశ—లలనా! ఈమాత్రమునకే యాయికామందిరమును ప్రవేశింపవలయునా! నానా! రామాభిషేకసమయమాసన్నమగుచున్నది. త్వరపడుము. ఆవరములేవో తెలుపుము.

కైక—(గనగా) పాపము ఉరివేగము రానిండు గొప్పరేలను గాచుకొనవలెను గొల్లకథనలెమన్న నీరాకే బ్రదుకినందదడి. నేనేయిచ్చిన కార్యమునకు నాకేమి బొమ్మగనుచున్నది. ఆలసించిననాకు హృదయచాంచల్యము కలిగి కార్యము చెడిపోవునేమో' త్వరబడెదను.

దశ—కైకా! ఏలనాలసింతువు

కైక—ఇది నిజ ప్రమాణమేనా?

దశ—అనుమానమునుగను పడవలేదా? అయినవినుము

గీ. వరములిచ్చితినని యన మనసె సాక్షి
కోర్కెలిచ్చితినిందుకు కులము సాక్షి
అడిదప్పను శ్రీరాము డగును సాక్షి
జాగుచేయక కోరుకొమ్మ నా సాక్షి

కైక—హాహా! పాపము శమించునుగాక. ప్రాణేశ్వరా! ఈమాత్రమునకే రామునిపై నొట్టుపెట్టుకొనవలయునా నాథా మీ మాటనాకు జాలదా?

దశ—ఇక కాలయాపనము చేయకుము నీవరంబుల వివరింపుము.

కైక—కోరుకొందునా

దశ—ఇంకను సంశయమేల (తనలో) ఈమె యేలనో వ్యా
హించుచున్నది. ఎట్టి కోర్కెలు కోరునో గదా చూచెదగాక.

కైక—ప్రాణేశ్వరా! గీ. రేపు రాముని యభిషేకమాపుచేసి
పట్టభద్రుని చేయుట భరతునొకటి

దశ—అహో! ఇదేటి కోర్కె రెండవది

కైక— వదియు నాల్గేండ్లు వసియింప వనములకును
బట్టి రాముని వెంటనే బంపుటొకటి!

దశ—ఆ! ఆ! ఏమది!! రామా!!! రామా!! రామా
(మూర్ఛిల్లును)

కైక—ఇదియే నైశ్వర్యము నవలంబింపవలసిన ఘట్టము,

దశ—గీ॥ ప్రేమబంధము నెటు దెంపి పైతు రామ
అడవి కెప్పటి కెటు పొమ్మ్న వాదరామ
మాకు ముందున వెనుకను గోయి రామ
రామ యిటులోరె నే జేతు నేమి రామ!

అనుబంధము 5

కైక—రాజేంద్రా! మీరిట్లారడి జెందుదురని యెరింగియే వరం
బుల నెరిగింప సంశయించితిని. కాని మీరు తెనిపోని ప్రమాణములు
చేసి నన్ను తొందరపెట్టినారు. ఇప్పుడు గతించినదానికై వగచిన ప్ర
యోజనమేమి?

దశ—ఏమిగతించినది?

కైక—వరములనిచ్చెదనని మీరు నాకు వాగ్దత్తము గావించినా
రు. అంతేగాక రామునిపై నొట్టుపెట్టి ప్రమాణము చేసినారు. నావరం
బులను మీకెరింగించితిని. రవికులభూషణులగు రాజేంద్రులాడినప్పటి
కనుక భరతునికి రాజ్యము రాకతప్పదు. రాముడడవి కేగకతప్పదు.

దశ—ఓ కేకయ రాజపుత్రీ! నగలో నా సొమ్ములో, ధనమో రా

స్వామీ, కోటలో పేటలో కోరుకొందువనుకొంటిని గాని యిట్టి కట్టడి కోర్కెల కోరుదువని నేనెన్నడును తలంపనైతిని.

కైక—అట్లయిన రాజేంద్రా! ముందుగా వరముల నొసంగి వాగ్దానము చేయలేకపోయితిరా? కోమలియొక్క ముద్దు చెల్లించెదనివారివలె ముందుగా వాగ్దానము గావించి యనంతరము విచారింపనేల.

దశ—నారీశిరోమణీ! నేవిచారించుటలేదు కోర్కెలీయ లేదని గాని, ఈయజాలనని గాని నేననలేదు. అనలేను నీకోర్కె లస్వాభావికములైనవనియు, ఇట్టికోర్కెల కోరువారపఖ్యాతిపాలగుదురనియు, నీకే వరప్రదానము గావింతునేని జనులు నన్ను స్త్రీలోలుడని నిందింతురనియు, నీవు గావించినది పైశాచిక కృత్యమనియు నీకెరింగించుచున్నాను.

కైక—రాజా! ఇవేటిమాటలు, కుమారుడు రాజ్యమేలవలయునని తల్లి కోరుకొనుట యస్వాభావికమా, తప్పొంగి తనతనయుని యుచ్చస్థితి నభిలషించిన నపఖ్యాతిపాలగునా? ఆడినమాట తప్పని భూనాయకుని స్త్రీలోలుడని జనులు నిందింతురా? కొంనకోర్కెలిచ్చెదనని కోరుకొనుము అని ప్రాణేశుడు ప్రాణములను విసిగించ గావలసిన వరములర్థించుట పైశాచికకృత్యమా! రాజా! రాజ్యమునకు కౌసల్యకొడుకే గాని నాకొడుకు పనికిరాడా?

దశ—పనికిరాకపోలేదు. కైకా! నీయిష్టానుసారము భరతుని పట్టభద్రుని చేసెదను, కాని రెండవకోర్కె.

కైక—మొదటిదిసిద్ధించుటకొరకే రెండవది నిర్ణయింపబడినది. రాముడడవికేగిన యింటనున్నవారిలో జ్యేష్ఠుడైన భరతుడు రాదగును. రామునారవంచి వానిరాజ్యమును భరతునికిందని కోరుటకు నేనంత యన్యాయవర్తినా, నాకుమాత్రము రాజనీతి తెలియదా.

దశ—ఓరాజనీతివిశారదురాలా, నీకాభయము వలదు. రాము నింటనుండి భరతుని రాజు జేసెదను. వచ్చునిందలను నేనుభరించెదను

అసత్యమునకు పాల్పడలేక నిశ్చింతగా బ్రతిమాలుచున్నాను. కైకా! రెండవకోరికనుమాత్రముమార్చుకొనుము. మార్చుకొని నాకుపకారమును చేకూర్పుము. చేకూర్చి నీవానందమునుబొందుము. పొంది లోకమందు ఖ్యాతిగాంచుము. వలసినచో నీరెండవకోర్కెకుమారు నూరువరంబుల గోరుకొను మొసంగెదను, రామువనవాసమునుమాత్రము తలంపకుము. ఈవరప్రదానము నీవునాకుగావించి పుణ్యముంగట్టుకొనుము.

కైక—రాజా! పరిపరివిధంబుల నిట్లుపరితపింపనేల? ఆడుదాన నైనను సూర్యవంశసంజాతనగు రాజపుత్రస్త్రీని, వీరమాతను గనుక యేదియెట్లైనను నేనుమాటతిరుగజాలను. ఇష్టమున్నచో వరముల నొసంగి సత్యవ్రతదీక్షనునిలుపుకొని కులమర్యాదలగాపాడుము. లేనిచో వరములయూనే నేనెరుంగనని బొంకుము.

దశ—ఛీ! ఛీ!! పాపాత్మురాలా!!! ఎట్టికారులరుచుచున్నావే నేడు నీపై నేదోయావేశించునట్లున్నది. కానిచో నిట్టివల్కులనుచ్చరించుటకు నీనోరెటులాడెనే.

కైక—నోరాడకుండుటకు నేనేమసత్యమాడ నుంకించుచున్నానా? రాజా! నేను నేనే కాని నీపై యసత్యదేవత యావేశించినదేమో యని నాయనుమానము.

దశ—పాపిష్టిగ్రహమా! నారీరూపంబున సంచరించుచుండిన కాలభుజంగమా! కేకయరాజగర్భజనితదావానలమా! నీవుమాయింటికి కార్చిచ్చువైతివేమే నీకేదురుద్దేశము నెవరుగల్పించిరే.

కైక—ఒకరుపదేశించుటకేమున్నదేమి? ఆర్యా! కాలాతిక్రమణమగుచున్నది. మీరుమీవాగ్దానమననుసరించి రామారణ్యవాసమున కాజ్ఞయిచ్చెదరా లేక

దశ—నారీ! మానినీరూపంబున మాప్రాణాపహరణము గావింపనిలచినమారీ! రామారణ్యవాసమున కాజ్ఞయిచ్చెదను. వానితోడనే

మేమందఱు కోరుదము, నీవొక్క రామారణ్యవాసమున్నే కోరుకొంటివిగాని నేను నీకును నీకుమారునకును తప్ప తక్కిన యయోధ్యాపురవాసులెల్లరికిని పరవాసమును గల్పించెదను. రక్కసీ! మేమెల్లర మడవులకేగినపిదప జనశూన్యంబును, స్మశానతుల్యంబునైన యయోధ్యను నీకుమారుడు పరిపాలించుచు, నీవుచూచియానందించుము.

కైక—ప్రాణేశ్వరా! ధర్మస్వరూపా! వనవాసమునగానిదియా అర్థము. అయోధ్యయంతయు నరణ్యము నకేగినచో నదివనవాసమెట్లగును. నావరంబులనిచ్చితినని పేరుబొందెద. ఘోరములైన వరములకోరితినన్న యపనిందకు నన్పాలుగావింపక నాకశిచేసి రామవనవాసము, భరతాభిషేకము అనునారెండుకోర్కెలను, భాగ్యభోగసంయుతమారణ్యవాసము, భరతునికి శూన్యపురీనివాసముగా మార్పనెంచుచుంటివా? అట్లెన్నటికినిజరుగరాదు. రాముడు జటావల్కలధారియై వనములసంచరింపబోవలయును. పదునాలుగేడులు వనముల కందమూలములే భుజింపవలయును, కటికినేలనే శయనింపవలయును.

దశ—పాతకీ! ఇక నూటలాడకుము ఇకనీవాగ్జాలమున విభ్రంభింపజేయకుము. కటికివానినోటనైన రానిమాటలు నేను నీనోట వచ్చుచున్నవి. నిన్ను బ్రతిమాలుకొనియెదను. ప్రార్థించెదను వేడుకొనెదను. నీకొక యిన్నూరువరంబుల నొసంగెదను. వలసినచో నా ప్రాణములనైన నొసంగెదను. నాజీవితకాలము నీ చెప్పుచేతల మెలంగెదను. ఒక్కవరము. నాకొక్కవరము ప్రసాదింపుము రామవనవాస కోరిక మరలించి నన్ను బ్రతికింపుము.

కైక—అయ్యో! పలుపలుకులేల వినుడు, రఘుకులమునకు కళంకమాపాదింపనెంచిరేని, సత్యవాక్పాలనము గావింపనెంతురేని, అంత్యకాలమందుసత్యమాడినాగన్న యపఖ్యాతికి బాల్పడ శంకింపరేని నాకోరిక నొసంగుడు, లేనిచో నన్నును నాసుతుని బంపింది

యిచ్చివచ్చినదుచ్చున గావించుకొనుడు. వసిష్ఠులవారిచే రహితముగా వింపబడిన యీశుభమువార్తమైన రాముని వనవాసప్రయాణమో నాపరలోక ప్రయాణమో జరిగితీరవలయును.

దశ—ఆహాహా! ఎట్టికఠినకఠోరములు. కైకా! ఇంతకంటెనన్ను శూలములతో బొడచిన మేలుగదా! రామా? జగదభిరామా! వనవాసరామా!!

కైక—తథాస్తు, తథాస్తు.

దశ—ఏ లేకే! రక్కసీ! రాముడే, నీలమేఘశ్యాముడే, దనుజవిరాముడే, కళ్యాణగుణాభిరాముడే వానినివీడి యెట్లు జీవించగలనే? రామా! రామా! [మూర్ఛిల్లును]

కైక—అదుగో రాముడు వచ్చుచున్నాడు.

(ప్రవేశము రాముడు]

రామ—అమ్మా! అభిషేకమంటపమునకు పోవుటకుముందు తల్లుల యాజ్ఞను బొందనెంచి కన్నతల్లిని దర్శించి యిందువచ్చితిని. నమస్కరించుచున్నాను. ఆశీర్వదించి యనుజ్ఞనిమ్మా.

కైక—కులోద్ధారకా! దీర్ఘాయుష్యమస్తు

రామ—ఔరా! ఏమిది తండ్రి మూర్ఛపడియున్నవాడు. తల్లి దీర్ఘాలోచనాపరవశయైయున్నట్లు గాన్పించుచున్నది. ఈమెనోట వెడలిన యాశీర్వచనవాక్యము సముచితముగా లేదు. తల్లీ!

అనుబంధము 6

గీ. సంతసముమాని యెంతయో వంతమునిగి
నేలబ్రాన్పడియుండెను నీధవుండు
తండ్రి యిటుజూడ నామది తల్లడిల్లె
కారణము దెల్పి పుణ్యంబు కట్టుకొనుము.

కైక—నాయనా! కారణమునకేమున్నది. తనయుడవైన నీ

వారియభీష్టమును నెరవేర్తువో లేదోయను సంశయముచే శోకించుచు మూర్ఛిల్లియున్నారు.

రామ—అమ్మా! అట్టియనుమాన మేలకలుగవలయు. జననీజనకులయాన నేనెట్టిదైన జవదాటుదునా? అమ్మా! మీరంబులయందు గుదున్న మునిగెదను. ఉద్రిజోరమున్న జొచ్చెదను. అగ్ని నురుకుమున్నను రికెదను. వేయేల ప్రాణముల నర్పింపుమన్న నర్పించెదను.

కై—హరహరా! పాపము శమించుగాక ఇట్టికట్టడికోర్కెల నే తలిదండ్రులు కోరుదురు నాయనా.

రామ—తల్లీ! అటులైన నేనిపుడేమి చేయవలసియున్నది. నాయనగారి యభిలాష యేమి? నీ వెఱింగినచో నాకు తెలియజేయుము. దాని నవలీల నెరవేర్చి జనకుని కానందము చేకూర్చెదను.

కైక—(తనలో) ఆలసించినచో భూపాలుడు మూర్ఛదేరిన కార్యభంగమగునేమో (ప్రకాశముగా) రామా! వినుము. మున్ను శంబరాసుర సంహారసమయంబున నా నాథుండు నాకు రెండువరము లొసంగెను. వానిని నేనిప్పుడీయుమంటిని ఇచ్చెదనని ముందువాగ్దత్త మొనర్చెను. పిమ్మట నే వివరించిన వరములను విని భూపాలుడు వానినీయలేక, ఈయవనలేక వాపోవుచు మాటిమాటికి మూర్ఛిల్లుచుండెను.

రామ—అమ్మా! ఈ సందిగ్ధావస్థ యేలకలిగెను.

కైక—తనయా! వరములనీయకున్న మీ జనకునకు సత్యదోషము కలుగును. వరములనిచ్చినచో నీకప్రియమగునని యాతనియూహ.

రామ—అప్రియంతమాత్రము కానేరదు. మా తండ్రి నీవరములను తప్పక యిచ్చితీరవలసినదే. ఒకవేళ నవి నాకప్రియములైనను తండ్రియొక్క సత్యకీర్తిని నిలుపుటకొరకు నే వానిననుభవించెదను అమ్మా! ఆవరములు నేవినప్రైనచో వినిపింపుము.

కైక—చెప్పుటకేమున్నది

గీ॥ కేవుసీదగునభిషేక మాపుచేసి
పట్టభద్రునిచేయుట భరతునొకటి

రాము—ఆనందమానందము అటులతప్పక జరుగవచ్చును
నా యభ్యంతర మెంతమాత్రమును లేదు తల్లీ! ఇంకొకటి

కైక—పదియునాల్గేండ్లు వసియింప వనములకును
పట్టి! నిన్నివ్వడే తాను బంపుటొకటి॥

రాము—ధన్యోస్మి! ధన్యోస్మి! ఇంతకన్న వలసిన దేమున్నది

ఉ॥ కోరకనాతితల్లియట కోర్కెలొసంగెను తండ్రియంట, యీ
ధారుణిలమ్ము నేలునట తండ్రికిసత్యమునిల్పునంట, భూ
భారముమాని సన్మునుల పాదములన్భజియించుమార్గమీ
దారినినాకుగల్గునట ధన్యుడనై తిని నేడుమాతరో॥

తల్లీ! నీకోరిక యే జనకునియాజ్ఞగా భావించి కాననాళి నీ కేక
బ్బాటులు పోయినుండి వచ్చెదను. అంతదనుక భరతుని రాజు జేయుం
చుము.

కైక—నాయనా! నీవంత వాడవని నే నెరుంగుదును. కాని తన
యాపోవునప్పుడు వనవాసోచితవస్త్రములను ధరించి భూషణాదులను
వీడి విల్లమ్ములను చేబూని వెడలవలయునని నాయభిప్రాయము.

రాము—అమ్మా! తప్పక అట్లేగావించెదను. ఆవస్త్రంబు
లను దెచ్చి నీవేనాకొసంగుము తల్లి యేమి పెట్టిన దానినే భుజించుట
యు, యేవస్త్రములనిచ్చిన వానినేధరించుటయు తనయులకు విధిగదా!
కావున నీవిచ్చిన వస్త్రముల నేధరించి నేనడవుల కేగెదను.

కైక—మంచిదట్లుచేయుము. నారచీరల దెచ్చియిచ్చెదను.

[లోనికేగును]

రాము—అన్నన్నా! జనకుడు నేద దేరు పెట్టు, తల్లిగారివరముల
వినినంతనే వీనిపై పిడుగువడినట్లయియుండును, మునలితనమున నీభూ

వానికెంతముప్పువాటిల్లినది. ఎగదీయగోహత్య, దిగదీయ బ్రహ్మహత్య యనునట్లున్నది వీనియవస్థ భూజాని

గీ. ఇచ్చిలేదనుటొప్పదం చెంచె నేని
కొంపమునుంచకనన్యాన కంపవలయు
పుత్రశోకము భరియింప బూనజేసి
కల్లలాడినదోషంబు గాంచవలయు.

ఏమిచేయుటకును దోచక యీమహారాజుమిట్లు పడియున్నాడు. ఔరా! విధి విలసితము నెరుంగనేరితరము.

[ప్రవేశము కైక]

కైక — నాయనా! రామా! ఇవిగో నారలు.

రాము — (అందుకొని) జననీ! ధన్యుడనైతిని, నేనీనారలందాల్చి జటాళిగట్టుకొని, తండ్రియొక్క సత్యమును పాలించుకొరకు వనముల కేగెదను. నీవుతప్పక నాసోదరుడగు భరతునకు రాజ్యాభిషేకము చేయించుము.

కైక — నాయనా! అట్లనేగావించెదను

రాము — అమ్మా! నాదింకొక ప్రార్థనగలదు నేను వనవాస ప్రయాణవార్త నెల్లరకు నెరింగించి ముఖ్యముగా నాజననియొద్ద యను మతినిగొని యేగెదను. కనుక బయలుదేరుట కించుక జాగగు నేమో క్షమించవలయును. ఏమైనను నేనుజనకునియాజ్ఞను శిరమున దాల్తునని నీకు నమ్మకము బుట్టించుటకొరకు నావిలువవస్త్రములను వీడి యిచ్చినారలను నీయెదుటనే దాల్చెదను. (అట్లుచేసి) అమ్మా! వనవాసరాముడు నమస్కరించుచున్నాడు కైకొనిదీవింపుము.

కైక—రామా! హాయిగా వరణ్యముల కాలక్షేపము చేయు చుండుగాక.

రాము- గీ. కైక వేసినవరముల కర్థమెఱింగి
మాటలాడగ లేకుండ మ్రాన్పడిన
తండ్రి! భవదాజ్ఞ నాదగు తలను దాల్చి
పోవువాడను కానన భూములకును.

అమ్మా! సెలవు

కైక—నాయనా! పోయిరమ్ము (రాముడుపోవును) అమ్మయ్యా! నాకెంత భారము వీడినది. ఇక రాముని వనవాసము తప్పదు ప్రాణనాథుని నేదదేర్చి, లాలించి రామవియోగమును మఱచునట్లు చే భరతుని యభిషేకప్రయత్నములు చేయించవలయును. మోహాలాపంబులతో పురుషులను వశము చేసికొనువిద్య స్త్రీలకుగ్గుపాలతో రంగరించిపోసినదిగదా. కావున నేబోయి శైత్యోపచారములకు తగిన సంభారముల గొనివచ్చెద.

(పోవును తెరవాలును.





# శ్రీ

# శ్రీరామపాదుకాపట్టాభిషేకము.



## తృతీయాంకము.-ప్రథమరంగము.

సీతాదేవియుంతఃపురము.

(ప్రవేశము-ఉచితాలంకారయై సీత)

సీత—అదే! అదే! నామనోహరుడు. (పరికించి) ఏమిది! అభిషేకసముచితములగు జరీమస్త్రులనుగాని నారలధరించి వచ్చుచుంటకు కారణమేమై యుండనో.

[ప్రవేశము మునివేషమున రాముడు]

సీత—ప్రాణేశ్వరా! వందనములు

రాము—జానకీ! నీకు శుభమగును గాత.

సీత—ఆ- కటకట యేటివేషమిది,

రా— కాంతరో! యియ్యవి ప్రస్తుతార్హమే

సీ— అటవికిఁబోవనెంచునల యాఖ్యలుమౌనులవేషమిది

రా— నేనటవికిఁబోవనెంచుటనె యంగనదాల్చితినిట్టియాకృతిన్

సీ— ఇటుమనరాజ్యమేమగునో

రా— ఇఁతిరో! తమ్ముఁడుదాసి నేలెడున్.

సీ—నాథా! ఇది హాస్యమా! నిజమా!

రా—నాతీ! హాస్యమైనచో నారశేల ధరింతునా? ఇది నీకె
రింగించుటకే యిందువచ్చితిని.

సీ— సీ. కారణం బెద్దియు గాన్పించ దిందుకు
రా— కాంతారవాసంబె కారణంబు
సీ— కాంతారమున కేగ గత మెయ్యదియొ నాథ
రా— తండ్రి దాయానతి తరుణి! గతము
సీ— తండ్రి యిట్లుగ చేయ తగు కారణం బేమి
రా— తల్లి కోర్కెల దీర్ప తండ్రి చేసె
సీ— ఈరీతి వరముల నేయమ్మ కోరెనో
రా— తల్లి కైకయె కోరె తండ్రి నిట్లు
సీ— కైక యిట్టుల కోరగా గత మదేమి
రా— కన్నవారలపై కూర్మి కారణంబు
సీ— ఇట్టులౌనని కలనైన నెరుగనైతి
రా— ధాత వ్రాతల దప్పింప దరమె మనకు.

సీత—ప్రాణేశ్వరా! ప్రయాణమునకు ముహూర్త మెప్పుడు.

రాము—ఇప్పుడే

సీత—అట్లయిన నేనును బోయి భూషణాదులవీడి నారలంధరిం
చివచ్చెదను.

రాము—ఎందులకు

సీత—వనాళిని సంచరింపబోవుటకు

రాము—నీవును నాతో వనమునకు వచ్చెదవా?

సీత—ప్రాణేశ్వరా! రాబోయినవింతగాని వచ్చినయాశ్చర్య
మేమున్నది.

రాము—వనమున నేమి గాదలచుచుంటివి

సీ—ప్రాణపతితో గూడి విహరించు పూవనమనుకొనుచుంటిని.

రా- సీ, నివసింపగాచెట్ల నీడలేగతిగాని
ఘనసౌధ రాజముల్ దనరవచట

సీ- సీ, నిజనాథుడాయని నీరజనేత్రికి
ధర్మహర్మ్యంబౌను పర్ణశాల

రా- పెక్కనంబై దోచు నక్కలరొదగాని
వీణారవంబులు వినగరావు

సీ- విభునితో సతతంబు విహరించు నాతికి
వీణా స్వనంబౌను వెలయు రొదలు

రా- భక్షించుటకుఁగొన్ని ఫలమూలములెగాని
వరసశాల్యన్నంబు దొరకదచట

సీ- పతితోడ నేవేళ నతియేగుచుండిన
యింపుగూర్చుచునుండు దుంపధూళి

రా- నిద్దురపోవగా నొద్దురాళ్ళేగాని
మృదువైన తల్పంబు కుదురదచట

సీ- పతిచెంత హాయిగా వసియించు రామకు
బూలపాన్పునుమీరు గ్రావశిలలు

రా- వనములందున వసియించు వారలకును
సౌఖ్యమంబరకుసుమమౌ నబలమిన్న

సీ- వనములందున పతితోడ జనెడుసతికి
హాయియరచేతి నిమ్మపం డగునునాథ

రా- కావునరిపుడు వనికేఁగ కాంతవీడ
మానుమానుము నీకోర్కె భూజాతసీత

సీ- గనుక నిను వీడి నేనిందు మనగజాల
నన్ను రానిమ్ము పావన నామరామ.

రాము— విపినములందు రక్కసిమూకల సంచారమెక్కువ, నా

రినిజూచిన మావంటివారికే భయమగుచుండును, వారు దుర్మార్గులు, మానవపలల భక్షకులు, రక్తపానము గావింతురు, మాయావేషులు, కామాంధులు.

సీత—నాథా! నాకు రాక్షసభయమా!

సీ. మునియాగరక్షణంబును చేయగాబోయి
    తాటకిఁ దుంచిన మేటిబలుఁడు
మాయావిశారదు మారీచు రణరంగ
    భూమిని గదిసిన పూర్ణబలుఁడు
ఘనునిను బాహుని ఖండించి గురువర్యు
    సంతోషపెట్టిన సాహసుండు
నిండుకొల్వున విల్లు రెండు ముక్కలు చేసి
    నను బెండ్లియాడిన యినకులుండు
పరశురాముని గర్వంబు భంగపరుప
విష్ణుచాపంబు నెక్కిడ్డ వీరవరుడు
నాదునాథుండు వానితో బోదుగాని
దానవాళికి వెంతునా మానవేంద్ర.

రాము—తరుణీ! నాతో నీవుగూడ నేతెంచిన యెడల జననీజనకుల కూరటగల్గించువారలెవరు? నీవింటనుండి వారికనునయవాక్యంబుల చెప్పి శోకంబుడుగ చేయుచు వారిసేవచేసి ధన్యతన్ గాంచుము. నేనడవుల కేగి పదునాలుగేండ్లందుబుచ్చి మగుడ యేతెంతును.

సీత—ప్రాణేశ్వరా! అత్తమామల పరిచర్యలకు మాచెల్లెండ్రగు నూర్మిళ, మాండవీ శ్రుతకీర్తులుగలరు. నేను భవత్పాదాంబుజంబుల సేవకొరకే యొకనిమిషమైనను నిలువజాలను. మీరుండని యయోధ్య నాకు నరకతుల్యము. మీతోనుండిన యరణ్యమె నాకు స్వర్గదృశము.

రాము—ఎంత చెప్పినను వినకుంటివి

గీ॥ పదియునాల్గేండ్లు వసియింప వనములకును
తండ్రియానతితలదాల్చి తరలుదేను
అత్తమామల సేవింపు మతివనీవు
మగని యానతితలదాల్ప దగునునీకు॥

మగనియానతిని మీరకుంటయే మానవతీధర్మముగదా.

సీత—ప్రాణపతీ! నిజమే పతిననుసరించియుండి యత్తమామలను సేవించుచుండుట సతీధర్మముగాని పతినెందో విడచి తానుసుఖముగా నింటగూరుచుండి పతియాజ్ఞ నెరవేర్చుట సతీధర్మముగాదు. మానవతికి పతియాజ్ఞలను సల్పెదుకార్యముకంటె పతినిసేవించెడుకార్య మెక్కుడుముఖ్యమైనది. మన్ననో నాయకా! మీరు మీజనకునియాజ్ఞను పూర్తిగా పాలింపనెంచుటలేదా!

రాము—ఎందువలన

సీత—మిమ్ము నడవికి పొమ్మని మీతండ్రి యాజ్ఞ యిచ్చెనుగాని మీలో నర్ధభాగము నడవికి బంపుమని యానతీయలేదు. అట్టితరి జనకుని సత్యంబునిలుపనెంచితిరేని మీయర్ధ శరీరంబగు నన్ను విడచి మీరెట్లడవికి బోవగలరు. కాన నోప్రాణేశ్వరా! నీపాదసేవకురాల. నీవెంట నంటివచ్చుటకు నాకనుజ్ఞయిచ్చి భూజాతపూతచారిత్రయను కీర్తినాకు శాశ్వతిమానట్లు జేయుము. నాముద్దుచెల్లింపుము. లేనిచో జీవములుండుటకల్ల.

రాము—ప్రాణేశ్వరీ! వనజీవనము కష్టమని యంటినిగాని నేను మాత్రము నిన్ను విడచియుండగలనా! నిన్ను విడచి నావనిని సాగించుకొనగలనా! లలనా! పోయి నావలె నారలధరించి కౌశల్యామందిరమున నన్ను గలియుము. త్వరపడుము,

సీత—ధన్యోస్మి! ధన్యోస్మి! (పోవును)

[రాముడేగును—తెరజారును]



## తృతీయాంకము-ద్వితీయరంగము-రాచనగరు

ప్రవేశము కోపముతో లక్ష్మణుడు



లక్ష్మ- గీ॥ మూర్ఖురాలైన కైకకు ముద్దుదీర్ప
కన్నకుమరుని రాముని కానకంప
దలచినాడట యీవేళ దశరథుండు
కటకటా యిట్టికార్యంబు గలదె భువిని॥

ఔరా! ఏమి యీయన్యాయము? ఏమి యీయసందర్భము? నిన్నటినిండోలగంబున, సభాసదులసముఖంబున రేడు రామచంద్రుని రాజ్యాభిషేకంబు గావింప నిశ్చయించి, యెల్లవారు భారములనాయత్తము గావించి, నేడు కైకమ్మగారికి కోరికలిచ్చు నెపంబున శ్రీరామచంద్రునకరణ్యవాసమును గల్పింప సాహసించెనా? నిన్ననీకోర్కెలు వానికేల జ్ఞప్తికిరాలేదు? ఆహా! నాతిపిశాచమా! ఎంతటివానిచేనట్టి యకార్యమును జేయించితివి? ఔరా! కృతయుగమందే మేరుసమానధీరుండగు దశరథక్ష్మాతలేంద్రుడే యిట్లు స్త్రీలోలుండై తనకాంతకు సంతసము చేకూర్ప కన్నకుమారునడవులకుబంప నంసిద్ధుడై యుండగా ముందుయుగములం దుద్భవించెడి పామరులగతి వేరేయడుగనేల? మానవతులెంతటివారినైన నిట్టే లొంగదీసికొందురుగదా. ఆవిధాత యీస్త్రీజాతి కింతటి యాకర్షణశక్తి నిచ్చియుండెనోగదా! స్త్రీలెంతటి ధీరవంతుల చిత్తమునైనను చిత్తుజేసి తమకనుకూలముగా మార్చుకొందురనుటకు లోకమునకు వేరొకయుదాహరణము వలయునా? ఇదిచాలదా? దశరథుడు రాముని వనవాసము నాజ్ఞాపించుతరిని రాజనీతియూను దలపడయ్యె కాబోలు, సత్యవాగ్బద్ధతానియమము సాధింపనెంచుట లేదు కాబోలు, కులము సూర్యకులము, పుట్టినది ఇక్ష్వాకువంశము, పాలించునది యయోధ్య,

కడుపునకన్నది నీలమేఘశ్యాముఁడౌ రాముని యిట్టిదశరథుఁడే యాడిన మాట నిల్పుకొనలేనిచో తక్కినవారి లెక్కయేల?

(ప్రవేశము రాముఁడు)

రాము—సౌమిత్రి యిటనొంటిగా నేమో యాలోచించుచున్నాడు. వెనుకనుండివిని మెదలక.

లక్ష్మ—ఆహా! తలంచుకొన్నకొలంది కడుపుతహతహలాడుచున్నది. గుండెదడదడలాడుచున్నది. శరీరము కంపమెత్తుచున్నది. బుద్ధి మాంద్యమగుచున్నది. ఏమిచేయుటకును పాలుపోకున్నది. రామా! సుగుణధామా! కోదండరామా! నీకువనవాసమా! భరతునకభిషేకమా! కౌసల్యకునుమాకునుసంతాపమా! కేకునకును కైకకును సంతోషమా! మాని రాజులందరకును పావనమైన నీదర్శనమా! నీవియోగబాధితులకు మృత్యుసందర్శనమా! నీవేగుటనటవియే వైకుంఠమా! నీవుండమి నయోధ్యయేనరకమా! రామచంద్రా! కీర్తిగుణసాంద్రా! ఏది తెరవు?

రాము—(తనలో) ఈతడు నాయభిషేకవిషయమైనమాటను గురించియే యిట్లువాపోవుచున్నాడు. దాఁగనువిని మెదద.

లక్ష్మ—ఏమినావెర్రి! అగ్నిహోత్రముకంటె పవిత్రమైన సూర్యకులసంజాతుండనై, శంబరాసుర సంహారియగు దశరథరాజనందనుండనై, సకలగుణవర్తియగు శ్రీరామమూర్తి కనుంగుసోదరుండనై, యన్నన్నకు గానున్నరాజ్య మింకొకఁ సింగన్నకిచ్చి యన్న నరణ్యమునకు నాజ్ఞయిచ్చిన యిట్టిసమయంబున నిట్లువాపోవం జెల్లునా? కావున,

సీ॥ అయోధ్యాపురవాసు లానందమునఁ దామె
భళిర! లక్ష్మణ! యంచు బల్కుచుండ
ఎత్తుకుతగినట్టు పెత్తిదేయనిచాల
హెచ్చుగామునులు నన్నెచ్చుచుండ.

రాముండు వనవాసరాముఁ డౌనఁటంచు
కౌసల్యమనమున గాసియుండ
పట్టాభిరాముని పాదపద్మంబుల
సేవమాకెన్నఁడు పోవకుండ
దశరథేశుని యపకీర్తి దిశలఁబార
కార్యవిఘ్నంబుకై చింత కైకఁబొంద
యవసరంబున్న దివ్యులనై నగల్చి
రామచంద్రునిపట్టాభి రామఁ జేతు॥

ఇదినాసంకల్పము. ఇందుకడ్డైనముతోడగుగాక. పోయివచ్చెద

రామ—సౌమిత్రీ! ఆగుమాగుము.

లక్ష్మ—అన్నా! ఇంతటిస్త్రీలోలత మొందైనన్నాటిమా.

రామ—ఇందుస్త్రీలోలతయినమాత లేదు. పలువలువిధంబులకల వరించెదవు. ఇది నాకు మేలుకొరకేవచ్చినది

లక్ష్మ—ఇవేటిమాటలన్నా! రాజ్యము మాని కారడవినివసించుట మేలనిమెదరా.

రాము—కానిచో నీయుద్దేశమేమి?

లక్ష్మ—ఏమియు లేదు. స్త్రీలోలత్వము చేయిచ్చవచ్చినమచ్చున యీఁయబడిన యీయసందర్భాజ్ఞల నావలకుబుచ్చి ప్రయత్నపూర్వక రాజ్యాభిషేకము గావించుకొనుము. ఇందుకునీవు సాహసింపజాలవేని దుర్మార్గులౌటచే తలిదండ్రులైనచునరే వారిశిరములనవలీలగాద్రుంచి నీకురాజ్యమప్పగించెద నాజ్ఞయొసంగుము.

రామ—హరహరా! ఎట్టిదారుణవాక్యములు,

సీ॥ వేలువెచ్చించుచు విలువదుస్తులమాని
నారలుదాల్చియే తిరుమనిరి
రాజ్యభారంబిచ్చు రత్నకిరీటంబు
గాక మౌళిఁ జటగట్టుమనిరి

పాదుకలైనట్టి ప్రజలనేలుట మాని
మునులనరక్షించి మ్రొక్కుమనిరి
ఈలోకసుఖమున కీనటంబొందించి
పరలోకమును తెరువరిడిరి
ఇట్టి పరమోపకారకులకెట్లు ఋణము
దీర్పవచ్చును నేమది దిగులుచెంద
నరికెదంచును పలికెదు పరుషముగను
తమ్ముడా! తండ్రిదంపుట తగునె జూడ॥

రాజ్యకాంక్షమునోన్మత్తుండవై జననీజనకులవధింతుననుచుంటివి చాలుపోతమ్ముడా! నీమొఖముచూడరాదు.

లక్ష్మ—విజ్ఞానపూరితదయాసముద్రా! రామభద్రా. ఎఱుంగక నేపల్కినపరుషోక్తులను మన్నింపవలదేయిట్టిల్లు మన్నాడను అన్నా! నన్విడిపోవనెంచుచునెడ నీఖడ్గముతో నాకంఠఖండనమైనగావించి పొమ్ము. లేనిచో నన్గూడగొనిపొమ్ము.

రాము—సోదరా! నీవునావెంటవచ్చిన యిట భరతుడు రాజ్యము చేయగలడా! నీవువానికి సహాయుడుగానుండుము.

లక్ష్మ—భరతునకు సహాయము శత్రుఘ్నుడుగలడు, అన్నా! శ్రీరామలక్ష్మణులనియు, భరతశత్రుఘ్నులనియుగదా వాడుక. నావచనమున కనుజ్ఞయిమ్ము.

రాము—సరే! అటులయిన మాతల్లిగారినొప్పించి, నారచీరలను జటాళిని ధరించి కౌసల్యామందిరమున నన్నుకలియుము. త్వరపడుము.

లక్ష్మ—చిత్తము (పోవును)

రాము—ఒకరిద్దరు, ఇద్దరు ముగ్గురమైనాము. ఇక బయలుదేరుటమంచిది

(పోవును- తెరజారును)

## తృతీయాంకము-ద్వితీయరంగము-కౌసల్యమందిరము

(ఉచితవేషిణియై కౌసల్య)

కౌస—ఆహా! నేడెంతసుదినము. కన్నకుమారుడగు శ్రీరామచంద్రుడు జానకీసమేతుడై సింహాసనాధిష్ఠితుండగుట జూచుభాగ్యము కలుగుచున్నది. ఇదేమో కాని యభిషేకలగ్న మాసన్నమగుచున్నకొలది నామనోధైర్యము సన్నగిల్లుచున్నది

(ప్రవేశము రాముడు)

రాము—అదె! జనని సర్వాలంకారభూషితయై యభిషేకమంట
పమునకు జనుదేర సర్వసిద్ధయైయున్నది.

సీ॥ తనయుని మేల్కోరి మనసార శ్రీనాథు
పూజజేయుచున్న రాజమహిషి
పతినె దైవంబుగా భావించినిరతంబు
పతిసేవనల్పెడి పరమసాధ్వి
తనవారు పెరవారలను భేదమదిలేక
ధనధాన్యములనిచ్చు దానశీల
గను పట్టభద్రుని గనుకేను తెరిజూడ
వేచియుండినయట్టి ప్రేమమూర్తి
దశరథేశుని తొలిరాణి ధన్యచరిత
నన్నుకడుపారకన్నట్టి సన్నుతాంగి
యైన కౌశల్యకీవార్త యక్కటకట
తెలియజేయగనెట్లుదతెలుపునాకు॥

హా రా! యీవార్త నేవిన్నవించినంతనె, పూతచారిత్రయగు నీమాత యెంతటివంత గుందునోకదా. తల్లి వెనలేని దుఃఖమును గూర్ప నెంచిన మాదౌర్జన్యమా! అయ్యో! ఇట్లు వాపోవనేల? తండ్రియొ

క్కు సత్యమును పాలించుకొఱకు కానల కేగనుండి తల్లికి చింతయును గూడునని విచారింపవగునా? మనోధైర్యము గలవారికిది లక్షణమా మాతయగు కోసలరాజకన్యకాతిలకముతో వాత వెరింగించి యూఱార్చి పోయెదను! శ్రీరాముఁడు ప్రణమిల్లుచున్నాఁడు

కౌ—తనయా! వచ్చితివా! ఇదేటియాకృతి

రాము॥ గీ॥ అమ్మ! వినవమ్మ కాంతంబు నాదు తమ్మ
పదియునాలుగు వత్సరా లిది మొదలుగ
నడవులన్నిటఁ గుశ భాగ్య మబ్బెగాన
దాల్చినాఁడ నారలు తల్లి నేఁడు॥

కౌ॥ ఉ॥ పట్టమునందెదం చనిబవాలి భంగుల నంతసమందుచుండగా
పట్టి! యిదేటివేసమిది భావ్యమె యిత్తెఱి యిట్టులుంపగా
నెట్టతవీడినావనము దీనతనందెను ముగ్గులయ్యె నీ
విట్టుజటాలిదాల్చుటకు నెయ్యదికారణమౌనొ దెల్పుమా॥

రా॥ ఉ॥ తల్లిరో! తల్లడిల్లకుము తమ్ముఁడు రాజ్యము నేలు నేనికన్
సల్లలితాగ్రగణ్యుఁడగు శర్వునిగా నెగ రాక్షసావళిన్
ద్రెళ్లఁగ నేసి సన్మునుల దీవెలలంద వనాళికేగెదన్
తల్లికిఁ గోర్కెదీర్పఁగను తండ్రికి సత్యము నిల్పఁజేయఁగా॥

కౌ॥ ఆ! రామా! రామా!! (అనిమూర్ఛిల్లును)

రా॥ అనుకొనినట్లయినది. యేమి చేయవలయును? ఈయుదంతమిా య కెరింగింపకుండ నేగుదుమన్న మాత నింతకన్న నెక్కుడు దుఃఖము వాతఁద్రోసినవాఁడనై యుందునుగదా! తల్లిని సేదదేర్చి యనుమతిని గాని పోయెదను.

కౌ॥ హా! రామా!

ఉ॥ పుత్రులు వేరటంచు మది పొక్కుచునుంటిని యున్నదాని నీ
పుత్రునిఁగన్న దాననొకొ పుణ్యఫలాగమ చేసియిప్పుడీ

పుత్రుడు కాన కేగినను । పుత్రవియోగము ప్రాప్తమాయెనా
పుత్రులు లేనివారలకు । పుత్రవియోగపు బాధ లేదుగా॥

తండ్రి! ఇదికలయా నిక్కమా?

రా॥ మాతా! సద్గుణసమేతా! ఇందసత్య మావంతయు లేదు. నీచెంతన యాశీర్వచనమును గొనుటకే యిందువచ్చితిని సెలవొసంగిన పోయివచ్చెదను.

కౌ॥ అహా!

చం॥ కడుపునఁ గన్నకూనయిటు । కాననకేగగ నిశ్చయాత్ముఁడై
వడివడి నానతిమ్మనుచు । వద్దకు జేరియు బానజేసినన్
దడదడమంచు గుండెలవి । దబ్బునవీనక నిల్చియుండగా
జడమతి బ్రహ్మనాదుమది । చక్కనిరాతితో జేసెనక్కటా!

రా॥ తల్లీ! పురంధ్రీమతల్లీ! విఖ్యాతంబునకు వీరమాతవగు నీవిట్లు శోకింపవచ్చునా? అమ్మా! నీయాశీర్వచన ప్రభావమున్న కాన భావమున్న, కాననంబుల నీరేడబ్దంబుల నీరేడు దివసంబులుగా బుచ్చి వచ్చెదను. కాలచక్రమిట్టె తిరిగివచ్చును. దీనికై యింత దురపిల్ల నేల?

కౌస—నాయనా! తల్లికి కోర్కెకీర్పవలెను అంటివి. నిన్నడవులకు బంపుమనియే తల్లికోరుకొన్నది రామా.

రాము—అమ్మా! వినుము. మజ్జనకుడు మున్నింద్రసహాయుడై జని శంబరాసుర సంహారమొనర్చునెడ సంగ్రామరంగంబున కేకయ రాజపుత్రి తనకుచేదోడు వాదోడుగా చరించినందులకు సంతసించి యామెకు రెండువరములొసంగెను. ఆయమ్మ వాటినిప్పుడు కోరుకొనెను. అందగు నాదగు రాజ్యలక్ష్మిని భరతునికి చెంతజేయుట. రెండవదినాకు పదునాలుగేండ్లు వనవాసము.

కౌస—ఇట్టి కోర్కెలను నా చెల్లెలు కోరెనా! ఇందుకు రాజేంద్రుడు సమ్మతించెనా! ఇట్టి ఘోరమిదివరకెన్నడైన కనివిని యెఱుగు

దుమా? సవతితల్లియగుట కైకయిట్లుగా కోరుకొని ననుకన్నతండ్రి తనయునటవికంప నమ్మతింపనగునా.

రాము—అమ్మా! కడుపగులవలదు. జననీజనకుల నావంతయు దూరవలదు ఇవంతయు విధికృతము కాననాళిని నే గావింపవలసిన కార్యము కొన్నిగలవు ఇంతేగాక వనవాసము నీవనుకొనునంతకష్టభాజనము కాదు. తల్లీ! వనవాసము ముక్తిసాధనము. అట్టి దయాచితము గా లభించినందులకు నాకుమిగుల యానందము కలుగుచున్నది.

అనుబంధము. 7

కాన—పట్టీ!

సీ. నవరత్నఖచితమై పట్టిపీఠంబున
వామాంకమునసీత భామయుండ
తమ్ముడుశత్రుఘ్ను డమ్మహానమయాన
శ్వేతాతపత్రంబు చేతబూన
భరతుండు సౌమిత్రి పార్శ్వంబులందున
వింజామరల్పట్టి వీచుచుండ
శ్రీరామరఘురామ సీతాపతేరామ
వహించుచును జనుల్ బల్కుచుండ
గురువులాదరునీమేలు గోరుచుండ
పట్టమందెదవనిసంభ్రమ పడితిగాని
జటలుధరియించి యడవికి సాగదంచు
నించుకేనియుకలనైన నెరుగనైతి.

కైకకీసంకల్ప మెనాటినుండి కలదోగదా!

చ. గురుడగు గాధినందనుని కోరికచొప్పున విల్లువంచి, వే
పరిణయమాడి జానకిని వచ్చినిబట్టులతోడ కైకకా
నరిగనుదండమిడ్డతరి సారసలోచన రామచంద్ర! నీ
వరిగెడు కాననాళిని యవ్వాడదీవన చేసి యుండునా?

రామ—మాతా! ఏల కలవరించెదవు? అరణ్యవాసము నావందమునతో ముగించివచ్చి భవద్దర్శనము గావించెదను. ఈ కాలమంతయు పతిసేవాయత్తవై చింతదొరంగి యుండుము.

కౌస—రామా! నీవు బోయిన నేనింక మనగలనా! నీవటవికేగిన నినువరించిజూచుకొని జీవింతును. నన్నీకానల కంపనమ్మిట్టిన భూనాయకుడు నన్నాదరించునా?

రామ—అమ్మా! అట్లులబల్కెదవు? పతియేగదా మానవతికి దైవము. నన్నటవికేగుమని యానతిచ్చినంత మాత్రమున నీపతి నీపై యనాదరభావము వహించునని తలంపనగునా! నీసోదరియగు కైకేయి రాజనందని నిన్ను విరసభావముతో జూచునా ఇదిగాక సర్వవిధముల నాకన్న నెక్కుడు మాతృసేవాతత్పరుడగు భరతుడు రాజైన మీకు లోపముండునా.

కౌస—ఔరా! విధి వశాత్ దుర్విలంఘనీయముగదా మున్నె యుగంబులనైన నెవ్వరైన యిట్టివింత సంపాదించి యుండిరా. తొల్లిటి రాజేంద్రులెవ్వరైన జ్యేష్ఠపుత్త్రు నడవికిబంపి రెండవవానికి పట్టముగట్టిరా.

రామ—అమ్మా! రాజ్యాభిషేకము గావించుటకంటె ఆడిన మాటదప్పకుండుట ముఖ్యాంశము. సూర్యవంశసంజాతులగు భూపతులకు, రాజ్యపరిపాలనముకంటె, సకలైశ్వర్య భోగభాగ్యములకంటె, తుదకు ప్రాణములకంటె, సత్యవాగ్రక్షణాదురంధరతయు పితృవాక్పరిపాలనాదీక్షయు ముఖ్యకర్తవ్యములని నీవుమాత్ర మెఱుంగవా?

కౌస—నాయనా! అన్నియు నెఱుంగుదును ఇందుకొరులదూరి నప్రయోజనమేమి. నిర్భాగ్యురాలనగు నాపురాకృతము నేనిందు[illegible] కొనవలెను. నామనోగతశల్యముల నూడబెఱుకగల తనయుని విన్నాంచితిగదా యని వంతవీసి సంతసంబున నేజీవించుచుండగా నింతటితో

నీ పెత్తనంతయు దిద్దిపెట్టిన యావిధాతృకృత్యంబుల నెఱుంగ నేరితరము
అహా! విధాతా.

సీ. పట్టభద్రాయుని పాడుప్రజలపా
నాశలన్నిటిని ని రాశజేసి
భర్తరాజైనచో భాగ్యరాణి యటంచు
పొంగు జానకి నిట్టి లోంగదీసి

(ప్రవేశము సీత)

సీత—నేనెంత యాత్రయు పొంగ లేదు. అత్తా! వందనములు.

కౌస—తల్లీ! నీకు మంగళమగుగాక.

సీత—ప్రాణేశ్వరా! నమస్కృతులు.

రాము—వనవాసప్రాప్తిరస్తు

కౌస—తల్లీ! జానకీ! చూచితివా! నలువయొక్క కృతులవ తన ఫలితము.

పుత్రవియోగాన పొరలి యేడ్వగ నాదు
చిత్తమందున పెద్ద చిచ్చుజేసి
ధర్మమార్గము వీడి దశరథభూమీశు
దారయాక్తికు దాసుజేసి
భరతునయోధ్యకంతకు ప్రభునిజేసి
పరమపావను నాముద్దు పట్టి రాము
వనములందున వసియింప పంపితౌర
ధాత! నీవ్రాత తెలియనీ తాతవశమె

సీత—అమ్మా! ఏలయిట్లు దురపిల్లుట

కౌస—అమ్మా! జానకీ! నిన్నుజూడ నాహృదయము మరింత దందహ్యమానమగుచున్నది. నీవుకూడ నారలదాల్చితివేల తల్లీ!

సీత—అత్తా! పాతివ్రత్యధర్మములు మీకు క్రొత్తలా? భర్త

ననుసరించుటయేగదా ఉత్తమస్త్రీకి లక్షణము నాపతి యడవికేగు చుండ నేబోవలదా?

కౌస — నీవును కాంతారముల వసియింప బోయెదవా?

సీత — ఔనత్తా! అదియే నామనోనిశ్చయము.

కౌస — సౌజన్యవతీ! సీతాసతీ! నీపతివ్రతాభిధానమునకు నీవే తగుదువు. తల్లీ! సతీధర్మమును సాగించుటకే యడవులకేగుచుంటివా! లేక మీయిరువురును పోవలయుననికూడ ముద్దులయిల్లాలగు కైకమ్మ గారికోర్కెలను దీర్చుటనెపంబున దశరథభూమీంద్రులానతిచ్చిరా?

(ప్రవేశము కైక)

కైక — నాకోర్కెలను దీర్చుటకుగాదు. తనసత్యవాగ్దీక్షనిలుపు కొనుటకు రాజేంద్రుడిట్లు చేసెను. పితృవాక్పాలనావ్రతతంత్రుడు గావున రాముడు దానిని పాలించుచున్నాడు ఇందు నాతప్పేమున్నది.

కౌస — చెల్లెలా! వచ్చితివా! భరతునికి రాజ్యమిచ్చి రాముని నింటనుంచరాదా! అడవికి బంపనేల.

కైక — (తనలో) వీరలయవస్థగాంచిన నాకెంతయు జాలిపొడ మచున్నది. కుమారుని విడనాడుకన్న తల్లికి కడుదుఃఖభాజనమే. దీని కంతకు కారణభూతురాలను నేనేకదా ఇప్పుడేమి చేసిన వీరలసంతాపమ డంగును. రాముని పోరాదనినుడువుదునా? అట్లుచేయుట చేయిగాలినవె నుక నాకులకై వెదకుట కాదా! రామునితోగూడ సీతయు బోయెదనను చున్నది. ఇదిమరింతదుస్సహముగదా! ఏమి చేయుదును. [ఆలోచించి] ఇచ్చట మరికొంత కాఠిన్యమును జూపి వీరి వెంట సౌమిత్రి యేగునట్లు గావిం చెద. అదియుభయతారకము (ప్రకాశముగా) అక్కా! రామునింటనుం చి భరతుని రాజుగా జేసిన లోకులు నోటగడ్డిపెట్టరా?

కౌస — అట్లయిన సీతగూడ యేలపోవలయును.

కైక — ఆమె రామునకు సహధర్మచారిణిగదా,

కౌస—అగును.

కైక—ఇందుచేతపోవలసినదే. అర్ధశరీరమింటనుండవలెగునా.

కౌస—పోవలసినదనియాజ్ఞ లేదుగదా.

కైక—పోరాదని నిషేధముగలదా. ఇంతయేల పతి వెంటపతి వ్రతపోదా! నాడు నేను సంగ్రామరంగమునకు జనలేదా ఈ మాత్రపు వన వాసప్రయాణమునకింత గందరగోళమూ పోవుటకిష్టము లేకున్న నీయాజ్ఞ నుల్లంఘించితినని తండ్రిగారితో జెప్పివేయరాదా లేక యొంటిగాపోవు టకించుక జంకుగానున్న యింకేనైన తోడుకొనిపోరాదా.

కౌస—చెల్లెలా! వనవాసంబునకెవ్వరు తోడుపోయెదరు.

కైక—ఎవరును లేకేమి? నాడు గాధినందను క్రతురక్షణమును హరకోదండవిఖండనంబునకును రాముని వెన్నాడిన సుమిత్రానందనుడు లేడా? వానిఁ బంపరాదా? అతడుపోరాదా? రామలక్ష్మణులను వాడుక లేదా?.

(ప్రవేశము సుమిత్ర)

సు—నిజము చెల్లెలా! నిజము. తప్పక సౌమిత్రి రాముని వెంబ డించును. అందుకాతడిప్పుడే సిద్ధమగుచున్నాడు.

కౌస—చెల్లెలా! మనోవాంఛితము నెరవేర్చుకొనుటకై యెం దరి నెంతటివంతల ద్రోయుచుంటివి శుద్ధాంతములందె కాలముగడ పుచుండిన జనకరాజతనయ నెట్టికష్టములపాల్జేయ నమకట్టితివి. పిన్న వయసువాడగు శ్రీరామచంద్రుండు సీతాలక్ష్మణసమేతుండై, నారలను జటాళిఁ ధరించి యడవికేగుచుండ చూచి యోర్చియుంటకు నీహృదయ మెంత పాషాణతుల్యముగ జేసికొంటివి ఇంత కాఠిన్యత నీకెట్లుకలిగెను.

కైక—ఇది రాజాజ్ఞగాని మరియొకటి కాదుగదా.

సు—ఔను! రాజాజ్ఞయే! అదియు నాథుదాని గోడువలన సంభవించినదియే!

(ప్రవేశము దశరథుడు)

దశ—నిజము! సుమిత్రా! నిజము

కౌస—
సుమి—
కైక—
} ప్రాణేశ్వరా! వందనములు.

రాము—తండ్రీ! నమస్కృతులు.

సీత—పితృవరా! ప్రణమిల్లుచున్నాను.

దశ—కళ్యాణమస్తు! సఖులారా! కౌసల్యాసుమిత్రలారా! నేనీ యాపదను చేచేతుల దెచ్చిపెట్టుకొని ధర్మపత్నులగుట మీకరబాలు వంచియిచ్చితిని. రాముడడవికేగిన

కౌస—
సుమి—
} నాథా! ఊరడిల్లుడు

దశ—ఇంకెట్లూరడిల్లుట! నాయనా! శ్రీరామచంద్రా.

రాము—తండ్రీ!

దశ—తండ్రీ! అత్యుదేమాని వేషమూనితివా? నేనెంతకఠినాత్ముడను, దుర్మార్గుడను, దుశ్శీలుడను, నిరంతర నారీలోలుడను.

రాము—జనకా, మీరును పామరులవలె యిట్లు దుఃఖిల్లుచున్నా

దశ—అమ్మా, జానకీ, నీవునాథుని వెంబడి తువాయేమి?

సీత—చిత్తము తండ్రీ

దశ—ఇదియొక విశేషమా! ఇక నాజీవములు దక్కుటకల్ల. సీతారామా, ఇట్టిగతి నీకావిధాత యేలలిఖియించెనురా రాముడనకరణ్యవాసప్రాప్తిగలదని వసిష్టవామదేవాది మహర్షులొక్కనాడైన నాతో బల్కలేదురా! తండ్రీ

(ప్రవేశము వసిష్టుడు)

వసి—ఇదియంతయు మేమెరుంగుదుము, కాని యేమిగొప్పవం

దలియని నీతో చెప్పవలయును. ఇది దైవసంకల్పమేగాని మఱియొండు కాదు. దీనికై వీరివారల దూషించక సీతారామలక్ష్మణుల వెదీసించి బంపుము.

దశ- గురువరా! లక్ష్మణు నెటుకుబాపవలయును.

వసి- అతడు రాముని వెంబడింప సంసిద్ధుడై తల్లియానతిఁగొని మౌనివేషంబున వచ్చుచున్నాడు.

దశ- లక్ష్మణా! నీవును పోవుచుంటివా

(ప్రవేశము లక్ష్మణుడు)

లక్ష్మ- ఔను! కఠినాత్ముడనై, కాంతాలోలుండనై, కుమారుని కానకుబొమ్మని నీవాజ్ఞయిచ్చితివి నాహృదయమింకను పాషాణత్వమునొందలేదు గనుక అన్నను వీడజాలక శ్రీరామపాదసేవసేయ మఱియుండజాలక వానిని వెంబడించుచున్నాను.

రాము- సౌమిత్రీ! నన్ను శౌర్యగుణమింకను విడువలేదా! శౌర్యగుణప్రదానుండవై చెలంగుచుండుమని యింటనుండి భరతునికి సహాయము చేయుచుండుము. నేనడవికిఁబోయెదను.

లక్ష్మ- పొరబడితిరన్నా క్షమింపుము. ఎరుంగక నేపల్కిన పరుషోక్తులను మన్నింప తండ్రిగారి పాదంబులకిదే ప్రణామిల్లుచున్నాను జనకా! ఇదె నామనఃపూర్వక నమస్కృతులందుకొని నన్ను మన్నింపుము మన్నించితినని యభయంబిడవేని నీపాదంబులనుండి లేవను.

దశ- నాయనా! మన్నించితిని లెమ్ము! రామునితో నేగుచుంట నీవతిధన్యుండవు.

కైక- సౌమిత్రీ! నీకై నారలుంచితినే! నీవు వానిని ధరించియే వచ్చితివా.

లక్ష్మ- ఓసీ! పాతకీ! రక్కసీ! నీవు మాతవగుట కొంతమేలైనది. సౌమిత్రికి నీపాపపుచేతితో నొసంగు నారలు కావలయునా! నా కేరియాజ్ఞయు లేదుగదా.

ముని- తనయా! వనములకేగనుండియు శౌర్యమునువీడ విదేమి పాపమురా

ఉ॥ కన్నకుమార! నీవరిగి కాననమందున రామచంద్రుకం
సన్నమెలంగియెల్లపుకు చాతురితోడను సాచరించినీ
యన్నను తండ్రిమారుగను అమ్మకుమారుగ సీతనాత్మలో
నెన్నిచతుర్ధశాబ్దముల నీవతివేర్పున వెళ్ళబుచ్చుమా॥

లక్ష్మ- మాతా! నీయానతిని తలదాల్తును.

(తెరలో) దేవా! శ్రీరామచంద్రా! మిమ్ముటవికిగొంపోవ మంద భాగ్యుండగు సుమంత్రుండు రాజేంద్రునియానతిని తేరాయత్తముగా విరచినాడు.

రాము- ఇదేవచ్చుచున్నాము. తల్లీ!

కౌస॥ తనయా! పోవలసినదేనా! నిన్ను మేమందరము వీడి యుండవలసినదేనా? నిన్ను కనిపెంచి పెద్దవానిని జేసినదిందులకేనా నేనోచిన నోములన్నియు నిట్టు ఫలోన్ముఖముగావించెనా? రామచంద్రా! మద్వంశతపఃఫలసాంద్రా! పోయెదవా! వనాళికి. వీడదవా మమ్మందర గొంపోదువా! శీతాలక్ష్మణుల మరచెదవా! జననీజనకుల రక్షింతువా మానిశేఖరుల శిక్షింతువా క్రూరకర్ములగు రక్కసుల. మరలివచ్చెదవా అతిశీఘ్రంబున.

రాము- అమ్మా! దీనికంతయుగలదా! యిదిగాక

సీ॥ మానవజన్మంబు । మహినొందువారికి
తండ్రిదైవంబుచు । దలపుమమ్మ
పితృవాక్పాలన । పెద్దలుమావారు
నలిపియుండినమాట । దలపుమమ్మ
తండ్రియానతియాట । తల్లినితెగనేసె
పరశురామునికీర్తి నెరు! గవమ్మ

రఘుకులంబునఁ బుట్టు । రాజులెన్నండైన
అన్నమాటను వీడు । టున్నదము
తప్పుదారినినామది । త్రిప్పకమ్మ
అరునన్నిదివత్సరా । లాయునన్ని
దివసములుగ బుచ్చితే । తెంతునమ్మ
మమ్మునదీవించి వేగమే । బంపుమమ్మ!

జానకీ! లక్ష్మణా! నా వెంటరండు. గురుజనపీఠనములకు ప్రదక్షిణనమస్కారముల గావించి దీవనలనంది పోగుదము.

(అటులచేయుదురు)

దశ- సీ॥ సూర్యాతపంబున । శోషిల్లకుండంగ
నీకుఛండాంశుడు । నిత్యరక్ష
కౌస- వానలయలజడి । బాధలందకయుండ
నయ్యవరుణుండునీ । కగునురక్ష
కై- వనములందునమీాను । మనసారదిరిగెడు
వేళలజంతువుల్ । వేలురక్ష
వసి- ఆకలిదప్పుల । యాయాసమదిలేక
యుండంగనశ్వివు । వానగురక్ష
దశ—పంచభూతంబులగుమనీ కెంచరక్ష
కౌ—తులువరాక్షసులింకనీ తోడరక్ష
గట్టిబాందదరెనలేని కఠినరక్ష
వసి—భూమిమానులకెకను శ్రీ రామరక్ష.

రాము—ధన్యోస్మి! మాతా! లేక యరాజగర్భాతా! సెలవొసంగుము.

కైక—మంచిది పోయిరమ్ము.

రాము—గురువరా! సెలవు! తండ్రీ దశరథ మహీనాథా! సెలవు తల్లీ! కోసలరాజపుత్రీ! సెలవు! అమ్మా! సుమిత్రా! లక్ష్మణాదులని నాకన్నులవద్దుగాని గొనివత్తును. పోయివచ్చెదను. జానకీ లక్ష్మణా! రండు (పోవుదురు)

[వసిష్ఠుడుతప్ప అందరు) హా! సీతాలక్ష్మణసమేత శ్రీరామచంద్రా

[అని మూర్ఛిల్లుదురు]

వసి—దేవకార్యమునకిదియే ప్రాయామము

(సరస్వతిప్రత్యక్షమై)

సర—సత్యము. సత్యము-ఇప్పటికి నావని పూర్తియైనది.

వసి—శారదా! అభివాదములు.

సర—శుభం భవతు. ఈశుభవార్త దివిజులకెరింగింప నేగెదను. కానీ యీరహస్యము బయలుగ్రక్కకుమా!

వసి—లేదు—లేదు తల్లీ!

(సరస్వతి అంతర్ధానమగును తెర జారును.)

(తెర లోపాటలు]

సీ. కటకటా యిటుకైక కఠినాత్మురాలేల
రాముకాననుబంప రాజుగోర
కైకకోరినయంత గ్రక్కనభూమిజాను
డేల రామునిబంప నియ్యకొనియె
తండ్రిబొమ్మన్నంత తానుచింతింపక
పోవ రాముడేల పూనుకొనియె
రాజిట్టులగోర రమణికి మంథర
యేలబోధించెనీ లీలచెడుగు
రాము డేగినరాజ్యంబు రాణచెడును
కోసలేశ్వరతనయ తా గోలుమునును
తెలుపొందుదువల్లదే తీవ్రగతిని
వదుడుగొల్తము శ్రీరామపాదములను.



# శ్రీ రామపాదుకాపట్టాభిషేకము.

## చతుర్థాంకము-ప్రథమరంగము.

### గంగాప్రాంతము.

[ప్రవేశము. సీతారామలక్ష్మణులు, సుమంత్రుడు.]

రాము — సుమంత్రుడా! పౌరుల విడనాడివచ్చుట యెంతకష్టమైనది. వారు మేల్కాంచి యెంతకలవరింతురో గదా. కలవరించి మన లనెంతదూరెదరో గదా!

సుమ — వారు మిమ్మేల దూరెదరు.

రాము — వారిని మోసపుచ్చివచ్చితిమిగదా.

సుమ — ఇట్లురాకున్న వారుమనల విడుతురా.

సీత — ప్రాణేశ్వరా! చూచితిరా! మలయమారుతమెంత హృదయానందకరంబుగ వీచుచున్నదో.

రాము — జానకీ ఇది సీటిగాలివలె దోచుచున్నది. ఈ ప్రాంతమందే దీనియొక్క జలాశయముండనోపును.

లక్ష్మ — అన్నా ఏదేనియొక జలాశయమైననేల ఇదె మనకనతి దూరంబున సకలకలుష విభంగయగు గంగాతరంగిణి గాన్పించుచున్నది.

రాము — అగును సోదరా జానకీ నేడు మనమెంతటి యదృష్టవంతులము.

సీ. నిర్వికారుండును నిశ్చలయోగుడౌ
జెట్టి శ్రీకంఠునియంఘ్రి బుట్టినిల్లు
తులలేని సిరిగల్గి యలకాపురినిమించు
వారణాశిపురి వాసభూమి
కయనాగ్నిమునిశరు వాశమందించిన
నిటలాక్షుశిరముం దా నిలచునీద
తవలోనమునిగను జనములకలుషముల్
పరిగబోద్రోలుట సహజగుణము
ధవునిసామేననిలచిన తరుణిసవతి
యంగనాకుణిసట్టి సద్గంగనిచట
తొలుత చేసిన పుణ్యంబు గలుగుకతన.
గాంచినారముకన్నుల కరవుదీర.

దీనిని మానవుడు తరింపవలయును. వేగనడువుడు.

సుమం—(తనలో) గంగను చేరుచున్నకొలది నాగుండెలలో దడ దడలాడుచున్నవి శ్రీరామచంద్రుండు తాను పత్నీసోదరసమేతుండై నావనెక్కినంతనే నన్ను బొమ్మనును గాబోలు దైవమా! ఇక నేనేమి చేయువాడ? ఏమిచేయుటకేమున్నది, రత్నంపుగనియగు రామచంద్రు నీఘోరాటవులజీవింపనిచ్చి నేనొక్కరుండను శూన్యరథుండనై పురిం జొత్తును. నేనానగరిలోనికిపోయినంతనే రామచంద్రుడేడియని గోలుమ నెడి దశరథేశునకును కౌసల్యాసతికిని యేమనినుడువువాడను. పరమే శ్వరా! నాకేలయీదుస్థితిగల్పించితివి రాముడు గంగావతరణముగావిం చినవెంటనే నాజీవముల నింపుగలిపికొందునా! అయ్యో! అట్లుచేసిన మరింతముప్పువాటిల్లునుగదా. నేనేగి రాముని క్షేమవార్త తెలుపకున్న చో తన్నాతలిదండ్రులు జీవింతురా.

రామ—సుమంత్రా! ఏమాలోచించుచుంటివి

రాము—గుహుడా! కోదండధారణంబున వనములసంచరింప వచ్చితిమి.

గు—ఏమేటి? అడవుల్లోనుండడానికొచ్చినారా? పెద్దదశరథమా రాజుకొడుకునై, జనకమారాజుగారి ల్లుడై యీ జేగురుపాతలుకట్టుకోని, లచ్చన్నబాబుని సీతమ్మని తీసుకొని యిలా రావాని కేటి కారణం బాబూ?

సుమం—నిషాదనాథుడా, గుహుడా, రామువనవాసకారణం వినిపించెద నాకర్ణింపుము, కైకమ్మగారికి దశరథరాజేంద్రుడు రెండు వరములొసంగెను. అందొకటి భరతునకు రాజ్యాభిషేకము, రెండవది రామునికి వనవాసము. అందుచే రామచంద్రుఁ డడవికిబయలుదేరెను వానిని వీడలేక సీతాలక్ష్మణులు వెంటవచ్చిరి. వారినింతవరకు గొనివచ్చుటకు మందభాగ్యుడనగు నేనువచ్చితిని.

గు—ఎవురది, సుమంతయ్యా! ఏటీ, బంతుదురాజా. రామయ తండ్రికడివా, ఏటీగోరం, ఏటియన్యాయం, బాబూ, నువ్వుమా వూళ్ళోంది మమ్మల్నందర్నియేలుకో, తిర్గితేబట్టు.

రామ—ఓయీ, రాజ్యకాంక్ష మాకింతయులేదు నీకు మాయందుగల భక్తి గలదేని మమ్మావలికి గడుపుము.

గు—మీసిత్తం, నావదెస్తా నొక్కసిట మిక్క ఉండండి,

(పోవును)

రామ—పోయిరమ్మా, జానకి, లక్ష్మణా సిద్ధులా.

సీత—
లక్ష్మ— } చిత్తము

రామ—సమంత్రుడా, మేమావలియొడ్డు జేరిన పిదప

సీ॥ గంగదాటితిమంచు కైకమ్మకొడుత
శ్రీఘ్రముగా నేగి చెప్పుమయ్య
నమ్మ కానకుబంపి నందుకు కైకపై

యాలుగవద్దని బల్కుమన్నతోడ
తనయాజ్ఞతలదాల్చి వనముఁదోనవసియింప
పోయిరమ్మనిబల్కు మయ్యతోడ
సోదరుసౌఖ్యంబు జూచుచుండెదనంచు
చిన్నమ్మతోడుత జెప్పుమయ్య
చెంతనుండమిసీతోడ జెప్పకుండ
వచ్చినందుకు క్షమియింప వలయునంచు
జనులకీబిడ్డలట్టుల మనవుమంచు
భరతరాజేంద్రుతోడుత బలుకుమయ్య!

సం—చిత్తము.

ల—సుమంత్రుడా! తనయాజ్ఞతీస్ తలదాల్తునని మాయన్న
తో మనవిచేయుము. తక్కినతల్లులకును నాతండ్రిగారికిని నానమస్కా
రులర్పించుము.

సు—చిత్తము.

సీత—అయ్యా! మామగారికిని ముత్త్వరత్తలకును జానకిదోసి
లొగ్గి వందనమిడెనని మనవిచేయుము.

గుహు—ప్రభో! పడవతయ్యార్.

రాము-జానకీ, సోదరీ, రండు. గుహుడా, పడవనెక్కవచ్చునా?

గు—సిత్తం ఆ! ఆ! ఉండండిబాబూ! కాసిన్నీళ్ళోసి మీపా
దాల్గడిచేసినానత్తికోనెక్కస్తా.

రాము—ఏల!

గు—ఏలేటు! రాయికేదిక్కునేదుగందా! మీపాదధూళితగిలి
నానావ ఆడదైతే నాగతేటి

రాము—ఔరా! వీనియాథభక్తి అటులే చేయుము.

(అందరుపడవపైనున్న పెనుక)

రాము—సుమంత్రా!

సు—సీ॥ మందభాగ్యుడనైన మరలనయోధ్యకు
దశరథరాము నే తరలుచుంటి
క్రూరకర్ముడనిమై ఘోరాటవులవీడి
తుదకీరాము నే జనుచునుంటి
దశరథునోదార్ప తమయాజ్ఞయీనాటచే
తాటకాంతక రాము తరలుచుంటి
భరతరాజేంద్రుని ప్రభునిగానొనరింప
పావనాత్మక రాము పోవుచుంటి
రాముపాదము విడవలేక రామతోడ
యటవిజేరుచున్న లక్ష్మణా యరుగుచుండ
తల్లి! జానకిమిము బాసి తరలుచుంటి
ధన్యతములారా! సెలవిందు తరలుచుంటి. (పోవును)

రాము—గుహుడా! ఊరకగనపడవేల! పాటపాడుము.

గుహు॥ పాడండ్రా! పాడండి
రామయతండ్రీ! ఓ రామయతండ్రీ
మా నోములన్నీ పండినాయి రామయతండ్రీ! రామ॥
మునులబాధ లడవిగలరు రామయతండ్రీ
ఆర్కిమ్రొక్కి దీవనలగనుము రామయతండ్రీ॥ రామ॥
రాకాసిమూకాలు రామయతండ్రీ
నిన్ను సీకాకువెట్టాయి రామయతండ్రీ॥ రామ॥
కొంటనుండి కొల్లుచుండి లచుమయమాబూ
నీవుదిన నన్నగాయాల లచుమయబాబూ! రామ॥
మెల్లి మెల్లిగల్లుమమ్మ సీతమతల్లీ
సువుమల్లుమాత్రు నూనుగుంట సీతమతల్లీ॥ రామ॥

మెల్లినాడ వెల్తవుగా (రామయ్యచంద్రి
నీవునల్లగిల్లుసేరాల రామయ్యచంద్రి॥ రామ॥
పడవప్రాణ్లమయ్యా బాబురామయ్యతండ్రి
మమ్మాణ్ణకాపాడిరచ్చించు మయ్యచంద్రి॥ రామ॥
(పడవపోవును తెరవాలును)



## విష్కంభము.

అయోధ్యయందొకవీధి



(ప్రవేశము విచారగ్రస్తుడై రామశాస్త్రియను బ్రాహ్మణుడు)

రామ—కీర్తిగుణసాంద్రా! దశరథసామశేంద్రా! మమ్మందర నిందువీడి దివినలంకరింపనేగితివా? ఇకమాకెవ్వరుదిక్కు? మమ్మెవ్వ రాదరణతో పరిపాలించువారు? భూసురావళికెల్ల నికమీదనేదిగతి? భూనాయకా! చివరకు నీకెట్టిమరణము సంప్రాప్తమైనది. దిగ్గజముల వంటి నలుగురుకొడుకుల గలిగియుండియు పుత్రా! పుత్రా! విలపించుచు మరణించవలసినంతటి దురవస్థ నీకావిధాత వ్రాసియుంచెనా.

(ప్రవేశము సోమాపధాని)

సోమ—రాముని రథము వెనుకకుమరలినట్లు చాలలుగాన్పించు టచే నాతడు తిరిగినయోధ్య వేగియుండునని మేమందర మిందువచ్చి నారము. కాని రాముడయోధ్యజొచ్చినట్లగానబడదు. రాముడిందువ చ్చియేయుండినయెడల యీపురియింత వికాసహీనముగా నుండునా? ఓహో! ఏమినాశిరి! నాచంచల హృదయస్వభావము, ఇదియంతయు దైవసంకల్పమునియు, దీనిదరింపనేరికిని తరముగాదనియు రామచంద్రు

ను వేయిసారులు మాతోనొక్కవక్కాణించి మున్నందరి వెనుకనుమర లుండని బోధింపలేదా? ఇదిగాక వనాళికేగనిశ్చయించుకొని బయలు వెడలిన శ్రీరామునకు వెనుకంజలిసి తిరిగిపురికి మరలివచ్చునా—ఇదే మా రామశాస్త్రి వచ్చుచున్నాడు. రామారణ్యగమనమునకే యీతడు విచారించుచున్నట్లున్నాడు. రామశాస్త్రి! రామవనవాసమునకే యి ట్లుదురపిల్లుచున్నావా? అది దైవసంకల్పము. దానికెవరేమి చేయగలరు

రామ—నాయనా! సోమావధానీ మననెత్తిపై గజ్జలతల్లి తాండవమాడుచున్నది. రామవనవాసమునకే మనపురిలో నాబాల గోపాలమింతియా చింతించుచుండగా గోరుచుట్టుపై రోకటిపోటన్నట్లు దశరథుని స్వర్గవాసముకూడ ప్రాప్తించినది.

సోమా—దశరథుడు మృతిజెందినాడేమి?

రామా—మృతిజెందెనాయని యింకను ప్రశ్నించుచున్నావా రెండురోజుల క్రిందటనే రామా! రామా! యని రామనామస్మరణము గావించుచు పరలోకంబున కేగెను.

సోమా—ఆహా! రామారణ్యగమనంబును, దశరథుని పరలోకగమనంబును వలపనితలంపుగా సంభవించి కోటలోనివారికిని పేటలోనివారికిని మిక్కుడుసంతాపము కలుగజేసినవి గదా రామశాస్త్రి! విచారమునకేమిగాని నాటికి భరతుడు వచ్చియుండెనా

రామ—అతడు నేటరేపట వచ్చునని యనుకొనుచున్నారు.

సోమా—విన్నదంతయు నిజమైనది. అట్లయిన మహారాజుగారి మృతకళేబరమునకు దహనసంస్కార సమయమున ముఖాగ్ని నెవ్వరుంచిరి?

రామ—ఏదీ! ఇంక అంతవరకు రానిదే.

సోమా—అనగా

రామ—ఇంకను దహనసంస్కారము గావింపబడలేదు. భర

కుందురాని దే దహనము గావించుటకు వసిష్ఠులవారంగీకరింపక పోవుటచే మృతకళేబరమును చెడకుండ తైలఘటమున భద్రపరచియుంచినారలు. నేడో రేపో భరతశత్రుఘ్నులు వచ్చినవెంటనే దానిని పైకి దీసి దహనము గావించి యుత్తరక్రియల నారంభింతురు.

సోమ—చూచితివా! నలువురుకొడుకులంగని సంతసించుచుండిన దశరథక్షితిపాలుని మృతకళేబరమును కొడుకులరాకకై తైలఘటమందుంచవలసి వచ్చినది. ఇది దైవసంకల్పముగాక మరియొండు కాగలదా?

రామ—వెర్రివాడా దైవసంకల్పముకాదు. కైకసంకల్పమనుము.

సోమ—కాదుకాదు. నీవు పొరబడుచున్నావు. కైకగావించినదంతయు దైవసంకల్పము ననుసరించియే యున్నది. ఏమంటివేని దశరథునికి పుత్రా పుత్రా యని యేడ్చుచు మరణింపుమని శాపము కలదట-ఆశాపమును సాఫల్యమందించుటకే భగవంతుడీ రామారణ్యవాసమును వానివెన్నాడి సౌమిత్రియేగుటయు, భరతశత్రుఘ్నులూర లేనితరిని కల్పించియుండెను.

రామ—పంక్తిరధునకు శాపమేల.

సోమ—మున్నొకనాడు మృగయావినోదార్థియై విల్లునమ్ములందాల్చి దశరథుండటవికిజని శబ్దమునుబట్టి కుంజరమనుకొని తనకోలతో, అంధులగు తల్లిదండ్రులకై నీరుగొనిపోవనేతెంచి కుండనంబువుల ముంచుచున్న మునిబాలకు నేసెనట. తరువాత తెలిసి విచారించెనట. మునిబాలుడా కోలబాధకు తాళజాలక నీరంబుగొనిపోయి తన తల్లిదండ్రుల కొసంగుమని దశరథుని కాజ్ఞాపించి తనువు చాలించెను. పంక్తిరధుండా జలపూరితఘటంబును వృద్ధులౌ మౌనిదంపతులకై దవుగొనిపోయి యీయుదంతమంతయు నెరింగించిన వారెంతయో తడవు

విలపించి పుత్రా పుత్రాయని పలుభంగుల గోలుపెట్టుచు మావలె నీవును మరణింపుమని దశరథునిశపించి కాలధర్మమొందిరట, కనుక మనమేని దూరవలదని నాయభిప్రాయము.

రాము.—ఎవ్వరిని దూరవద్దు. రాముని విడచియుండవలసిన మనదురదృష్టమునే దూరవలయును. అయినదేదో అయినది. పోదము పద—(పోవుదురు)



శ్రీ

# శ్రీరామపాదుకాపట్టాభిషేకము.

పంచమాంకము - ప్రథమరంగము - రాజమార్గము

(దారినిబోవుచు భరతుడు స్వగతముగ)



భర — ఏమి యీపురంబింత వికాసహీనముగానున్నది? ఏట
నెప్పట్టున వీక్షించినను, అమంగళకరంబులును, అశుభసూచకంబులు
ను, అసౌఖ్యదాయకంబులును, అసందర్భంబులును అగు లక్షణములే
కాన్పించుచున్నవి. కాని సౌఖ్యసంధానంబులై యానందదాయకంబు
లగు చిహ్నలెందునుపొడసూపకున్నవి రాజమార్గమంతయు నిర్మాను
ష్యంబై, తేజశ్శూన్యమై యలంకారరహితమై కన్పట్టుచున్నది రా
మాభిషేకమునివార్త నంపియుంటిరిగదా అభిషేకమానంద సంభా
రంభితే యుండవలసిన పట్టణమిప్పుడు శోభదొరంగియుండుటకు గతమె
య్యదియోగదా అభిషేకంబుజరిగిన చిహ్నమావంతయు నీపురంబున
దోచకున్నది. రామాభిషేకము జరిగియుండదా? జరిగియుండనిచో నా
కేలయీవార్తవచ్చును? కాకున్న యభిషేకమహోత్సవమున కేదేని
యాటంకము వచ్చియుండునా? ఏమినావెర్రి! సకలకార్య దురంధులు
ను, అనన్యసామాన్య విక్రములును, మహాబల తేజస్సంపన్నులును, ర
ఘుకుల ప్రదీపకులును, ఇక్ష్వాకువంశ శిరోభూషణులును, సూర్యవంశ

వయఃపారావార రాకానిశాకరసురులును, మంత్రిగారును అగు ద
శరథభూమి జేంద్రుని మనఃసంకల్పమునకు అడ్డంకులగునా? అదియటుండ
సకలకల్యాణగుణధాముడును రూపలావణ్యజితసోముడును, పితృవాక్ప
రిపాలనాభిరాముండును, అతులితపరాక్రమభీముడును, అగు శ్రీరా
మునకభిషేకము దలంపబడిన దానికడ్డంకులగునా? ఒకవేళ తలవనితలం
పుగానే దేనివిఘ్నమాటంకము కలిగియుండినను కార్యాకార్య విచ
క్షణుండగు లక్ష్మణుండు దానినోర్వింపు జేయలేకయుండునా? తప్పకసో
దరుడగు శ్రీరామచంద్రునకభిషేకము జరిగియే యుండును కాని యట్లూ
హించుట కేవియు నాధారములు గాన్పించకున్నవి. నగరంబున నెందై
న కలకలంబులుగాని, మంగళతూర్య నినాదంబులుగాని, రామరాజ్య
సంస్తుతులుగాని అభిషేకమహోత్సవ పరికంకలుగాని, శ్రీరామనామ
స్మరణములుగాని, రామరాజ్యసంస్తుతులుగాని, వినవచ్చుటలేదు నాకే
మో యుపురింజొరబడిన దాదిగ యపశకునములే బొడగట్టుచున్నవి.
నామనమందేలనోగాని యొకవిధమగు నాందోళనము జనించుచున్న
ది. దశరథ సార్వభౌముండు సంకల్పసిద్ధుండౌగాక. శ్రీరామచంద్రుడు
సీతాలక్ష్మణసమేతుడై సురక్షితముగా నుండునుగాక. సత్యనిరూపణ
మును జేయజాలక యిట్లవితర్కించుచు నిందు కాలయాపనము గావింప
నేల? శత్రుఘ్నుండీపాటికి కోటకేగియుండును. అతడు నాకన్నిటి నె
రింగించును. నేనును తదరికేగి యుదంతంబు నారసి యంతిపురంబున బో
యెదను. (పోవును)

# శ్రీరామ పాదుకా పట్టాభిషేకము

## పంచమాంకము-ద్వితీయరంగము-కైకయాంతఃపురము

(కైక విచారముతో ప్రవేశము)

---

కైక—హా! కట్టసి దైవమా! తుదకిట్టిగతి కల్పించితివి. ఇంతటి దుర్గతినాకు కలుగునని నేనెన్నడును తలంపలేముగదా? అయ్యో! ప్రాణనాయకా! నీకు నేను మరణాంతమును చేచేతుల దెచ్చిపెట్టితినిగదా? భరతుడు పట్టభద్రుండగునని సంతోషానంధము నొంది యూరెత్తిదానివలె నారణంబుల వేడికొంటిని. కాని నీవిట్లు మరణింతువనియు, నాకీవైధవ్యదుఃఖము సంప్రాప్తించుననియు నేనుకలనైన తలంపలేదు. దశరథరాజచంద్రా! ఇక్ష్వాకువంశపయోవార్ధిచంద్రా! పారావారంబున దలిబడ బాడబానలంబునకు నేనుకార్చిచ్చునైతినిగదా! నాథా! సకలజగజ్జేగీయమానులును, దిగ్విజయపరాక్రమధీయులును, వర్ణనాతీత సౌందర్యశీలురును, సత్యపరిపాలన ధురంధరులును, రవికులభూషణులును, శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్ననామధేయులును అగు నలువురు తనయులం గలిగియుండియు నొక్కకుమారుండును చెంతలేక తరిన స్తమింప వలసినంతటి దుర్గతికి నిన్ను బలవంతముగా నీడ్చుకొనివచ్చిన దానను నేనేగదా! దైవమా! భర్తకు మరణమాపాదించిన పరమపాతకినైననాకు మరణాంతరమున ముట్టియుండట్లు కలిగించెదవుగదా?

ఏమిది-తాను సుతులులేని తరినిమరణించవలవినదిగా తన్నొకముని శపించెనని నాథుడంతిమ వాక్యములజెప్పి యుండెనుగదా! ఆమునిశాపము సిద్ధించుటకే నాకిట్టి సంకల్పము పుట్టినది శక్తి కలిగించియుండును. కావున నిదియంతయు నిందితురాలను నేనైతినిగాని దైవకృతమే—అల్లదే! భరతుడువచ్చుచున్నాడు.

(ప్రవేశము భరతుడు)

భర—మాతా! కేకయ రాజదౌహిత్రుడు నమస్కరించుచున్నాడు గైకొనుమమ్మా

కైక—నాయనా! మనోవాంఛా ఫలసిద్ధిరస్తు

భర—అమ్మా! నీవిట్లుల నుంటివి. నిన్నుజూడ నాకుభయమగుచున్నది. నీముఖారవింద బింబము కళదూలాగి యున్నది. నీవలంకారశూన్యవై, మలినాంబరధారివై యశ్రుజల పూరితనయనవై యంతిపురిని మంగళసూచకము గావించి పెద్వాంతము నింగించుచున్నట్లున్నావు. తల్లీ! తండ్రి గారికి కుశలమా!

కైక—కుశలమా! తండ్రిగారికి! హా తూన్నత తీంద్రా

భర—అమ్మా! నాయనగారి కేదేని యాపదతటస్థించెనదా! వారేదేనియుగ్మతచేత బాధనందుచున్నారా అమ్మా! తండ్రిగారెక్కడ

కై—నాయనా! యిక్కడితండ్రి?

చం॥ తనయుడ! యేమి చెప్పుదును ధర్మ మతప్పని నీదుతండ్రి తా
ఘనముగు శోకచంద్రమును శాంతిలమన్నును, మిన్నుముంచి, త
న్ననయము దైవతుల్యముగ నాత్మదలంచి చరించుచున్నయీ
జనములనెల్లరన్విడచి స్వర్గముజూడగ బోయెనయ్యయో!

భర—హా తండ్రీ! (అనిమూర్ఛిల్లును)

కైక—అహా! వీరందరి కేట్టియార్తి దెచ్చివెట్టితిని. కుమారా! యూరడిల్లుమూరడిల్లుము.

భర—అమ్మా! ఇంకి నాకెక్కడియూరడి! హా తండ్రి! పుత్రవత్సలా! రఘువంశోద్ధారకా! శంబరాసురసంహారకా! గతించితిరా? అయోధ్యాపరిపాలనము నీకాయానముగల్పించెనా! ఇంకపుత్రాయని ముద్దుమ్ముద్దులుబిల్చు వారలెవ్వరు? నేనెంతటిపాపాత్ముండను!

నిన్నుకడసారిజూచునంతటి మహాభాగ్యమునకు నేనునోచనైతిని గదా. అన్నన్నా! సోదరుడు శత్రుఘ్నుడీవార్తవిన్న నెంతదుఃఖమునో గదా! భరతశత్రుఘ్నులము మేమిరువురము నీకుపేరునకే పుత్రులము. తండ్రియవసానదశయందు దరినుండి, పరలోకగతుండగుచుండిన తండ్రికి కైవల్యమబ్బుకొరకు శ్రీమన్నారాయణు చరణారవిందంబుల భజింపనివాడు శత్రుడుగాక పుత్రుడగునా? అమ్మా! తండ్రిగారి సంత్యదశయందు కన్నులకరవుదీర ప్రేక్షించి కడసారివాక్కులాలింపని మాయిరువురిజన్మంబులు నిరర్థకంబులుగదా?

కైక — కుమారా! ఆవిషయమున మీరిరువురు నొక్కటే నోము నోచిరి.

భర — అమ్మా! ఏల? నాయనగారు [illegible] మావలెనె శ్రీరామలక్ష్మణులుకూడ దరిని లేరా?

కైక — లేరు. అందుచేతనే మీజనకుని మృతకళేబరమునింక నొకతైలఘటమందుంచవలసివచ్చెను.

భర — హా! తండ్రీ!

సీ॥ పుట్టినాడవుగదా పూర్ణవిఖ్యాతిని
బడసిన యిక్ష్వాకు వంశమందు
పట్టినాడవుగదా బహుధర్మయుక్తమై
దనరుచుండెడిరాజ దండమోలిమి
కొట్టినాడవుగదా క్రూరదానవశంబరు
నింద్రునహాయార్థ మేగినపుడు
కన్నవాడవుగదా కమనీయమూర్తులౌ
తనయులనలువురి ధన్యచరిత
అంతవాడవుమతులులే నట్టితరిని
సతులనెడబాసి సుతులకు సౌఖ్యమీక

పరమపదమును బొందంగ వలసెనహహా
భూరిగుణసాంద్ర! దశరథ భూతలేంద్ర!॥

కైక—కుమారా! ఈవిచారమ కెన్నటికైన నంతమ్ముకలుగునా! ఇదిశోకమునకు దిగ్గ్రమింగి పితృఋణవిముక్తి కార్యమునకుఁ గడంగి యనంతర కరణీయంబూహింపుము.

భర—మాతా! అనంతరకరణీయము నావలన నేమిగలదు. నేనుదమ అనుకొనవలసినవాడ నేగదా? అన్నిటికిని పెద్దవాడగు శ్రీరామచంద్రుఁడున్నాఁడుగదా. నాయనగారి స్వర్గమనువార్త నెరింగి యీపాటికి వచ్చియుండఁడా?

కైక—కుమారా! రాముఁడింత వేగము రాఁజాలఁడు. రాముఁ డిక పిప్రింతమాసత్రేమ.

భర—ఆతఁడెందుఁబోయెను.

కైక—రాముఁడు సీతాలక్ష్మణసమేతుఁడై పదునాలుగేఁడ్లు వసియింపఁబోయెను

భర—ఆ! ఆ! ఏమంటివి?

కైక—సీతారామలక్ష్మణులు వనవాసమునకేఁగిరంటిని.

భర—హా! రామచంద్రా!! (మూర్ఛిల్లును)

కైక—నాయనా! మాటిమాటికి యీమూర్ఛలేటికి? కష్టసుఖములు మానవులకుగాక యింకెవరికి కలుగును, జాతస్య మరణంధ్రువం అను నార్యోక్తి కలదుగదా. పుడమినిజనించు ప్రతిజీవియును, యెందోయొకచోట నెప్పుడోయొకప్పు డేదోయొకమూలమున మరణించక తీరదుగదా! అట్లనే మీతండ్రిగారు మరణించియున్నారు. ఇఁక రాముని యరణ్యవాసమా! అది వానిపూర్వజన్మకర్మానుసారము. దీనికై నీవిట్లు శోకించుటపాడియా! నాయనా! వీరుఁడవైన నీవిట్లు దుఃఖిల్లినఁ బో నబలలమూ, రాణివాసకాంతలమూ అగు మాకేదిగతి? కావుననో

తనయా! ధైర్యమువహించి, తెలుపుట నిర్లక్ష్యముగు మీతండ్రిగారి మృతకళేబరమునకు దహనసంస్కారముగావించి యుత్తరక్రియలాచరించి. యరాజకమా రాజ్యంబును ప్రభుశూన్యలా ప్రజలను సముద్ధరించు తెరంగూహింపుము

భర—అమ్మా! నీవింతగా ధైర్యమును చిక్కబట్టి యుపన్యసించ గలిగినందుల కలిగితిని గాని తండ్రిగారి మరణోదంతమును వినినంతనే వేగము నన్నుగిలిన నామనోధైర్యము రామారణ్యగమనవార్త నాలించినంతనే పూర్తిగా నశించినది. ఇక నేనేమియు చేయజాలను?

కైక—వెర్రివాడా! ఆ చింతకునా! రాముడూరలేనికతంబున ప్రస్తుతమింటనున్న వారిలో నీవే జ్యేష్ఠుడవైనకతంబున, తండ్రిగారి కొడుకుల రాముడుగావలసిన కృత్యంబులన్నిటిని నీవే నెరవేర్పవలసియున్నది. కావున గురువులగు వసిష్ఠులవారిని రావించి వెంటనే యావసి గతంగుము

భర—అమ్మా! అన్నపిలుచుకొనివచ్చి యాతనిచేతనే యాకార్యము నెరవేర్పించెదను పిదప నాతడే రాజ్యభారమువహించి మనల నేలును.

కైక—రామచంద్రుడు చతుర్దశాబ్దంబులు గతించినగాని వనములనుండిరాడు.

భర—ఏలరాడు! వనములపదునాలుగేండ్లు వసియించి రావలయునని వానినెవ్వరైన శాసించిరా?

కైక—ఇంకెవరు? మీజనకుడే శాసించెను. తండ్రియాజ్ఞ యామాటనే తలదాల్చి రాముడడవికేగెను, వానివీడియుండలేక సీతాలక్ష్మణులేగిరి.

భర—ఏమి! యాజ్ఞయింత? అభిషేకమనివార్తవింటి నాతండ్రి

రామునకరణ్యానవమేగ నిర్గమించెను; అమ్మా! ఇప్పుడు నిజముగా రాజ్యము రాజకమైనది?

కైక — అరాజకమెట్లయ్యెను?

కన్నతండ్రి గతించెను అన్న యడవులకేగెను రాజ్యభార మింకెవ్వరు తలదాల్తురు. ఇదిగాక

ఉ॥ నాయకుడు లేని రాత్రియును ! సోదరి బంధనిశాస్త్రవిద్య యు
ద్ధముము లేని వీరుడు వి ! శేషత జూపని నాతి సర్వదా
నీతము లేని వైద్యమును ! నిశ్చలభావము లేని మానిశ్రీ
రాముడు లేని రాజ్యమును ! రంజిల జేయవు భూజనావళిన్॥

కైక — రంజిల జేయుదని రాజ్యము రాజకముగా వించుకొందురా?

భర — వించుకొనక యహమ్మస్పియుని యెవ్వరు బూనుకొం దురు?

కైక — రాముని తర్వాత వాడవు నీవు గదా! రాజ్యభారము నీ తలం దాల్తువు.

భర — అమ్మా! ఇట్లన నీకో తగునే

కైక — తల తెరంగెరింగితి నిందుకల కారణమేమి?

భర — రామునడవికేగుమని తండ్రిగారేల శాసించిరి,

కైక — తన సత్యవాగ్దత్తము నిలుపుకొనుటకు

భర — అనగా

కైక — కుమారా! అంతయు వివరింపుచుందువా

భర — చెప్పవలయును నా మనంబు తొందర జెందుచున్నది,

కైక — నాయనా! మున్ను ఇంద్రదన సహాయులై జని శంబరాసురునితో మీతండ్రిగారు పోరియుంట వింటివా.

భర — వింటిని. ఆ సమరమునకు నీవుగూడ బోయియుంటివిగదా

కైక — పోయియుంటయే కాదు. పతికి సహాయమున్నై పోరోనర్చితిని.

అందు కాయన మెచ్చి నాకు రెండువరములిచ్చెను,

భర—కావచ్చును, తరువాత

కైక—ఆ రెండువరములను నేను తలచినప్పుడు గైకొనెదనం టిని, అందుకాయన సమ్మతించెను,

భర—అమ్మా! ఈ ఉపోద్ఘాతములేల? అసలుసంగతి దెల్పుము.

కైక—ఆ రెండువరములను నేనిపుడు వేడుకొంటిని.

భర—ఏమి! దీనికంతకు కారణవు నీవాయేమి? ఆ వరములేవి?

కైక—గీ॥ రామచంద్రుని మారుగా । రాజ్యమందు
పట్టభద్రుని నిను జేయు । వరమదొండు

భర—ఇది నాకు వరప్రసాదమేనా! నాపాలిటి పెద్దమ్మా! రెండవకోర్కె.

కైక—పదియునాల్గేండ్లు కాంతార । వాసమునకు
నరుగ రాముని శాసించు । టరయ రెండు॥

భర—ఛీ! పాపాత్మురాలా!

కైక—ఇక వీనిచే చీవాట్లు దప్పవు

భర—రామచంద్రా! కీర్తిగుణసాంద్రా! నీకెంతటియార్తి నా జననిమూలమున సంభవించినది. ఓ కేకయరాజపుత్రీ! ఎంతటి ఘోరమును బుద్ధిగట్టితివి? ఈ దుర్బుద్ధి నీమానసమున దెట్లు జనించినది. ఈ దురాలోచన నీకెవ్వరుపదేశించిరి? కోరిక వాఁడంగిరని కొంపలముంచదలంచ వచ్చునా! రామవియోగమున భరింపజాలక తండ్రి గతించియుండును. అంతేనా?

కైక—అంతే

భర—ఎంత ఘోరము గావించితివే! ఎంతటియాపదను మా వంశమునకు దెచ్చిపెట్టితివే! ఎంతటిశోకసముద్రంబున మజ్జనములాడ కౌసల్యాసుమిత్రలముంచితివే! ఎంతయు దుర్భరంబగు వైధవ్యంబు నెంతవ్రా

ఒకతో దప్పుకొంటివే? మణిప్రాణమగు శ్రీరామచంద్రు నట్టికష్టముల పాల్జేసితివే? ఎండకన్నెరుంగనిజానకి నెంతటి బాధలన్గొన్పితివే? కలుషాత్మురాల!

కైక—కుమారా! ఏలనంతగా విచారించెదవు.

భర—ఛీ! ఛీ! నన్ను కుమారాయని బిల్వకుము.

ఉ॥ మారతవునీవు నాకనుచు। మన్ననచేసితి నింతకాలమున్
భూతమ! నాదుసోదరుని పూజ్యునిమానుని రామచంద్రుని౯
భూతపిశాచమార్గగుగు। భూమములుండగ బంపినావుగా
పాతకి! నీవుతల్లివటె। పాపకన్నెతిని నీకుబుట్టుటన్॥

కైక—తనయా! తల్లినిట్లు దూషించుటపాడియా

భర—దుష్టాత్మురాలా! తల్లిదూషించుట పాడికాదుగాని, కుమరు నడవికి బంపుమని నాథునిగోరుటపాడియా? ప్రాణేశ్వరుని ప్రాణములన్గొనుటపాడియా! ఘాతకీ! భర్తృప్రాణాపహరణం తకీ! ఎంతటి పాపురాలవుగాకున్న ఇంతటిసాహసమునకు గడంగుదువా

సీ॥ శ్రీరామచంద్రుండు। ఘోరాటవులకేగ
కన్గొనగల్గితే। కఠినురాల
కల్యాణియౌసీత। కాంతుని వెన్నాడ
కన్గొనగల్గితే। కఠినురాల
భూపాలుడౌ తండ్రి। పుత్రాయటంచేడ్వ
కన్గొనగల్గితే కఠినురాల
మోహనాకారుండు। ముద్దులలక్ష్మణుడేగ
కన్గొనగల్గితే। కఠినురాల
ప్రోడయిల్లాండ్రుసుతులవై। గోడుజెంద
కంటకన్గొనగల్గితే। కఠినురాల
భైరవిదేవిసాక్షిగా। పాపమునకు
ఘోరకార్యంబుజేసితే। క్రూరురాల!

కైక — నాయనా; నీమేలుకోరియే నేనింతమట్టుకు సాహసించితిని. కావున శోకగించక రాజవై నాకు కన్నులపండువు గావింపుము.

భర — ఛీ! ఘాతకురాలా! జననివేష సంచారిణివగు నోపిశాచమా! దశరథునిపాలిటి కాలభుజంగమా ఇంకను ఎట్లుమాట్లాడుచుంటివే.

కైక — భరతా! ఏలయీపరితాపము. నీవు నన్నిపుడింతదూరి నను ప్రయోజనముగలదా? గతించినదానిపై వగచి ప్రయోజన మేమి! కావునరాజ్య-

భర — పాపాత్మురాల, రాజ్యము ఘోరనరకపదము. కలుషాత్మురాలవు నీవునాకు తల్లివై సంతరించిన నీదుష్టచేష్టలకు, అసందర్భపు సంకల్పములకు, గొంతెమ్మకోర్కెలకు పాపకృత్యంబులకు తలయూచి నేను భవదాజ్ఞానువర్తినై చరింతుననితలంచితివా? పాతకీ!

సీ॥ పావనుండౌరాముఁ । భార్యతోడ తగూడ
కానకుబంపితే । కఠినురాల
బలవంతుడూన భర్తప్రాణముల్ హరియించి
వైధవ్యమొందితి । వ్యర్థురాల
పూతచారిత్రయా । మాతకౌసల్యను
మందిఁ దేశోకాబ్ధి । మూర్ఖురాల
ప్రభువురాముండని । పలవించుజనులకు
గూర్చితే దుఃఖంబు । క్రూరురాల
అన్నవెనువెంటనడవుల । కరుగుచుండి
పంటినావట లక్ష్మణు । పాపురాల
ఇన్నిబాధలకింపరి । నేచుకంటి
నీవుమడియంగరాదటే । నీచురాల॥

కైక — కుమారా! సాధ్వినగు నన్నిట్లు దూరుట నీకుయుక్తమా? తల్లినినిందించువాని కెందైన కీర్తికల్గునా?

భర—నీవు గావించినదంతయు కీర్తిజనకమే కాంబోలును? కైకా! నీవు సాధ్వివైనచో

ఉ॥ భూతలనాథుపట్టియగు । భూసుత నాథుఁ తోడ కూడి తా
నీతరి కాననాళికిని । యేగగ దాఁ తను సాధ్వియౌటనీ
వా తెరగభ్యసించితివి । నాత్మదలంచి గణించి యుండినన్
పూతచరిత్రవంచు నిను । భూజను లెల్లను సంస్తుతింపరే॥

సాధ్వివైనచో చానక యోజించియుంటివి.

కైక—నాయనా! చావవలెనదే గాని నీవు భూతలమేలగా జూడవలయునని జీవించియుంటిని.

భర—ఇంకను నే రాజ్యము నేలుదుననుకొనుచుంటివా? నీకంత కోరికగానున్న నాకునూరుగా యీ నేలనీవేలికొనుము.

కైక—నీవేమి చేయుదువు?

భర—ఏమి చేయుదునా? వసిష్ఠులవారి యనుమతిని పితృఋణ విముక్తుడనై, నాయిలను జనకునివాల్చి, శత్రుఘ్నుడు వెంటరా, చతురంగబలసమేతుండనై, శ్రీరామునాన స్వాగతము గావించుచు రామమూర్తి జానకీలక్ష్మణులతో కూడి వసియించుచున్న వనంబునకేగొచ్చి వారి పాదారవిందంబులకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి, జనకుని మరణవార్తవిన్నవించి, వారితో బాటు దనకునిక్కై కొంతవడివిలపించి, శ్రీరామునవరోధ్య కమ్మని ప్రతిమాలిగానివత్తును. అనుమానమువలదు రానిచ్ఛగింపజేసి అతనితో బాటు నేనును పదునాల్గేండ్లు వనవాసము గావించి వచ్చెదను. అంతే గాని నేనీ రాజ్యమునోల్లను, రామునూన్యంబగు యీనగరినివాసంబునోల్లను దాస్యసహితంబులగు నీమనోవాంఛితంబు వ్రల్లను రక్కసీ! బోధపడినదా.

కైక—బోధపడినది చేతగానివానివలె సిద్ధముగానుందిన రాజ్యమునువీడి వనాళికేగెదనని యనుచుంటివి? రాచపాడి యా! శేకపీర

ధర్మమా! కాకమీవంశలాంఛనమా.

భర—పాపీ! నోరుమూసుకొనక కారులరచెదవేల!

కైక—రామభక్తునివలె బిట్టుమాట్లాడుచుంటివిగదా

గీ॥ తండ్రియానతి బోబోయి దప్పటంచు
భూమిసుతతోడ బోచ్చెను రాముడడవి
తల్లియాజ్ఞను మీరుట తప్పటంచు
ధరణినేలగ రాదొకో తనయనీవు

మాతృఋణముతీర్చుకొనరాదా! యిక్ష్వాకు కులజులకిదిచెల్లదా

భర—ఛీ! ఛీ! భ్రష్టురాలా! యిక్ష్వాకువంశనాశనహేతు భూతురాలా! పురాకృతపాపఫలంబున నేనునీగర్భమున జన్మించితిని. ఈజన్మంబునగూడా యాజ్ఞసిరసావహించుతునేని ముందెట్టి యధమాధము గర్భంబున జన్మింతునో.

గీ॥ కొడుకం వడవికిబొమ్మన్న! క్రూరురాల
పతిని గోల్పడినట్టి! నిర్భాగ్యురాల
రాముడానతి లేకుంట భూమిపైని
బ్రతుకగల్గితి పోగదే పాపురాల॥

నిన్నుజూచినకొలది నాయొడలు మంటయెత్తుచున్నది. నేపోయెదను.

కైక—నాయనా! భరతా

భర—ఛీ! ఛీ! (పోవును)

కైక—అనుకొనునట్లనది. నేను రెంటింటికిచెడిన రేవడినైతిని. ఆశాభంగమైనది అపకీర్తిపాలైతిని. మంధరా! నీవునాకొంపముంచితివి

(తెరజారును)



## శ్రీ రామ పాదుకా పట్టాభిషేకము.

### పంచమాంకము-ద్వితీయరంగము-కౌసల్యయంతఃపురము



కౌస—ప్రాణేశ్వరా! మాకిక నెవరుదిక్కు! పతిగతించిన సతి యొక్క జీవితమతిహేయముగదా! తనయా! రామచంద్రా! నీవీవార్తను విన్న యెంత శోకింతువో గదా! కారడవుల జానకీలక్ష్మణసమేతంబుగా నెట్టియిక్కట్టుల పాలగుచుంటివో కుమారా! పదునాలుగువత్సరములు గడియు టెన్నటికి? మా కార్తిదీరందుట యెన్నటికి?

(తెరలో) గీ॥ రాముకానకుబంపిన రామకొడుకు
ప్రభుసిరాముని గొమ్మన్న పాపికొడుకు
భరతుడన్యగ నీభువి బరగువాడు
నిన్నుజూడగ వచ్చెనో కన్నతల్లి॥

ఎవరిదీ కంఠస్వరము— అఁ! భరతుడు. పితృకర్మలనాచరించి రాజ్యపదవినంది మాతకు సంతసంబొనగూర్చితినని నాకుజెప్పవచ్చుచున్నాడుగాబోలును. వీనిమోము నేనెట్లుగాంతును! వీనితో నెట్లుసంభాషింతును?

భర—(వెనుకటి పద్యమును చదువుచు ప్రవేశించి) అమ్మా! భరతుడు నమస్కరించుచున్నాడు.

కౌస—ఏమందును. నాయనా! రాజ్యకార్యనిర్వాహకుండవగుము. వీనియీ వేషమునకర్థమేమి?

భర—మాతా! రాజ్యకాంక్ష నాకు గలదనియే నీయభిప్రాయమా

కౌస—కానిచో యింతమట్టుకేల వచ్చును?

భర—అమ్మా! సకలమెరింగినజగన్మాతవు. పరమపవిత్రవు. పూతచారిత్రవు నన్నన్నమాతకన్న యన్నివిధంబుల నెక్కుడుదానవు.

వ శిలందాల్చుట యువరాధమా! నాయనా! రాజవై మాకెల్ల నానంద ము చేకూర్పుము.

భర—అయ్యయ్యో! ఇంకను నాకు రాజ్యమునియే పల్కుచుంటివా! ఇది నాకేది తెరవు. నాయందలి యీ యపనింద నెట్లు తొలంగించు కొందును దిక్కు లేనివారికి దైవమే దిక్కందురు గదా

సీ॥ రాజ్యంబుపై నాకు రాగంబు లేదని
చెప్పుడీ తల్లితో సిద్ధులార
రాముండు నాకభి రాముండౌటెంచు వం
జననికి దెల్పుడీ సాధ్వులార
జానకి తల్లితో సమము నాకనిమీర
లక్ష్మతో దెల్పుడీ యక్షులార
కైక జేసిన క్రూర కార్యమెఱుగనంచు
దెల్పుడీ కుంబతో దివ్యులార
పృథివి యశత్రుతాము బరగుడి క్ష్మాపులార
సకలమెఱిగిన యోగాని చ[illegible]లార
నాదు నేరంబు సుంతయు లేదటంచు
నమ్మకముబుట్ట దెల్పుడీ యమ్మకోడ॥

(ప్రవేశము వసిష్ఠుడు)

వసి—అమ్మా! కౌసల్యా! భరతుడు నిరపరాధుడు.

కౌస—గురువరా! నమస్కృతులు. సంతుష్టాంతరంగనైతిని.

భర—గురువరా! నమస్కృతులు. అమ్మా! వందనములు.

కౌస—నాయనా! మనోవాంఛాఫలసిద్ధిరస్తు. కుమారా! పితృ ఋణవిముక్తుండవైతివా.

భర—అమ్మా! దహనసంస్కారము గావించితిని. ఉత్తరక్రియల రామునితో గూడి యొనర్చెదను.

కౌస — తండ్రీ! అదినీకెట్లుసాధ్యమగును. రాముడడవియున్నాడుగదా.

భర — అమ్మా! నేనందులోకాదను.

కౌస — రాజ్యము నేలవా.

భర — అమ్మా! పుణ్యసాధ్వీ! సర్వజనహృదయాభిరాముండగు శ్రీరాముం డడవినుండ నేనీపట్టణంబున నివసింతునా! తల్లీ! కీర్తిగుణ సాంద్రుండగు శ్రీరామచంద్రుడు జటావల్కలధారియైయుండ నేను మణిమకుటంబుల తలదాల్తునా? మాతా, సకలజగన్నుతకీర్తియగు శ్రీరామమూర్తి కాననంబుల నారచీరలందాల్చి చరించుచుండ నేను విలువవలువల దాల్తునా? జననీ! సుగుణగరిష్ఠుండగు మదీయ సోదరుడు కందమూలాదుల భక్షించి కాలముగడుపుచుండ నేను షడ్రసోపేతభక్ష్యంబుల నారగింతునా? జనయిత్రీ! రాముడడవినుండిన నాకీరాజ్యమేల? ఈనగరనివాసంబేల? ఈచతురంగబలంబులేల? రాజ్యభోగంబులేల.

కౌస — అట్లయిన నాయనా! నీయుద్దేశమేమి.

భర — మాతవగు నీయనుజ్ఞను యీవేషంబున, గురుశత్రుఘ్నులు వెంటరా చతురంగబలసమేతుండనై, శ్రీరామభక్తితత్పరుండనై మత్సహోదరుని దివ్యపాదారవిందంబుల సేవచేయు నుత్సాహముతో నాటికినాటికి దారివెంబడి నామహానుభావుని దివ్యనామసంకీర్తనముగావించుచు, అన్నదరికేగి జనకుని మరణవార్తయెరింగించి గురుసమక్షంబున శ్రీరామలక్ష్మణులతోబాటుత్తరక్రియలము గింది,

కౌస — పిమ్మట

భర — పిమ్మట నోమాతా! రాజ్యభారముతలందాల్ప నసమర్థుండననియు. తప్పకదయచేసి జానకీసమేతుండవై పట్టభద్రుండవు కావలసినదనియు రాముని వేడి తోడితెచ్చెదను.

కౌస—కుమారా! తిరిగి యెంతలో వచ్చితివు.

భర—జననీ!

గీ॥ అన్న రాముకు కనుగొంచి యడవివీడి
వచ్చెనేనియు నేనువచ్చువాఁడ
నట్లురాకున్న నాతని యడుగులండి
వనములందున పాయిగా మనెదనమ్మ॥

కౌస—అయ్యో! యిట్లయిన రాజ్యమేమగును?

భర— గీ॥ కొడుకుకై తాను పతికట్టికొర్కెవేసి
దాచిపెట్టినయట్టి యీధరణితలము
కొడుకువనములకాలంబు గడుపుచుండ
యేలుకొనుమమ్మ కైకతానింకమీఁద॥

తల్లీ! నీవిందుకాటంకపుమాటచెప్పవలదు.

కౌస—నాయనా! నీయిష్టము. పోయి రామునియాజ్ఞానువర్తి
వై మరలిరమ్మ.

భర—చిత్తము (పోయివచ్చెదను)





శ్రీ

# శ్రీరామ పాదుకా పట్టాభిషేకము.

షష్ఠాంకము-ప్రథమరంగము-గంగాతీరము

ప్రవేశము-భరత-శత్రుఘ్నులు-వసిష్ఠుడు.

భర—గురువరా! రామునియొక్క కీడుదలంచిన యారాముని కుమారుడనౌటచే పిపీలికాదిబ్రహ్మపర్యంతముగల జీవరాసులన్నిటికిని నవిరోధినైతిని. కనకకశ్యపునకు ప్రహ్లాదునివలె నేకైకకు జన్మించితిని. నాయందేకలుషమును లేదుగనుక ప్రహ్లాదునకు విష్ణుసాన్నిధ్య మబ్బినట్లు నాకు రామునిపాదసేవ లభింపదా.

వసి—భరతా! ఏలవాపోయెదవు త్వరలో రాముని జూడగలవు.

శ—అన్నా, మనమిదే గంగానదిని సమీపించితిమి.

భర—ధన్యోస్మి, ధన్యోస్మి, ఓ పతితపావనీ, సురధునీ.

గీ॥ కైక కడుపున బుట్టిన కలుషమొకటి
కన్నఋణము దీర్పని జన్మమొకటి
అన్నకంపిన యపకీర్తి నందుటొకటి
బాపుమా యమ్మ పావనీ భర్గురాణి॥

వసి—రాకుమారులారా, మనమీనదిని దరింపవలయును.

(ప్రవేశము గుహుడు)

గు—ఏటా గడ్బిడ, ఎవ్రుళ్లావచ్చోళ్ళు, ఓ, ఓ, గుర్రాలు, రథాలు, ఏనుగులు, సిపాయిలు, అన్నివత్తున్నాయి.

కే—అదె యెవఁడో నిషాదుఁడిటువచ్చుచున్నాఁడు. వానినహాయ
మున మనమీనది దాటుదము.

గు—అయ్యా, మీరోళ్లండి

వసి—గుహుఁడా

గు—ఎవురది? వసిష్టయ్యా, దండాలండోయ్

వసి—నీకుశుభమగునుగాక.

గు—గ్డాలబాబూ, ఏటీసుదావుడంతా, ఎందుకియన్ని యడ
వులోన్కి, ఈబాబులోరుబాబూ.

వసి—వీరుభరతశత్రుఘ్నులు, రామలక్ష్మణులజూడ బోవుచు
న్నారు.

గు—ఏమిటి? భరతుఁడా, యేంరాజునేవయ్యా, రామయ
బాబునడివికంపేసి ఈయన్నరాజమేల్దమనానాయము. ఇదిసాలక మల్లా
యుద్దానికొచ్చారా? మా గొప్పమనసులయ్యా, ఆయమ్మకియబ్బా
యి నరిపోయినాడయ్యా, అలాగైతే ముందునాతోయుద్ధంసేసి యెల్ల
య్యా, నీశక్తే గెలుస్తాదో నాబక్తే గెలుస్తాదో.

భర—ఇః నాజీవనమేలకాల్పనా, భరద్వాజునిచే వడఁచివాట్లు
తిని వానిని సమాధానపరచివచ్చితిని. మిగిలినది నిషాదుడు పూర్తిచేయు
చున్నాడు. కేకయరాజపుత్రీ; రామకార్యమునకు విఘ్నముకలిగినందు
లకు లోకమెంత తహతహలాడుచున్నదో నాకుగలిగెడు చీవాట్లవలన
తెలియుచున్నది. ఇట్టితరిని శాంతమేభూషణము, అయ్యా, నేనురామునితో
సంగ్రామమునకేగలేదు.

గు—మరుందుకేటి.

భర—రాముని గొనివచ్చుటకు

గు—ఎల్లవయ్యా! నానునమ్మను

వ—గుహుఁడా! నిజమే

గు—చక్కగాని రామయ్యబాబుని బలిమలాడ్డానికైతే యిల్లాం కాయిందుకు. ఈళ్లెయొద్దనుంచండి. మీరుముగ్గురెల్లి ఆబాబుల్ని అప్పన్నిమాసిరండి

భర—వారలెందున్నారు?

గు—సిత్రకూటంలో

భర—మామువ్వురిని దాటించుము

గు—రండిమిమ్మల్ని గడిపేత్తాను

(పోదురు— తెరజారును)



శ్రీ

# శ్రీ రామ పాదుకా పట్టాభిషేకము.

సప్తమాంకము-ప్రథమరంగము-చిత్రకూటము

(సీతారాములాసీనులై యుందురు సౌమిత్రి దూరమున నిలుచును.



సీత—నాథా! ఈవనమెంత యానందజనకమో జూచితిరా

రామ—జానకీ! నాకేలనో చిత్తమస్వస్థమై యున్నది. యిప్పటికిం
కను కుదుటఁబడ లేదు.

(తెరలో భరతుఁడు) గీ॥ తండ్రియానతి బాలింప దలచువాఁడు
ఆలిసోదరుఁ గూడి యరుగువాఁడు
పావనాత్ముఁడు రాముడు ప్రభువునాకు
వానిజాడల దెల్పుడీ వనములార

రామ—సోదరా! జూచిరమ్ము

ల—చిత్తము [పోవును]

రామ—కంఠధ్వని భరతునిదివలెనున్నది

సీ—అతడిందేలవచ్చును

ల—(తిరిగివచ్చి) గీ॥ రూపమందున నినుఁబోలు భూపవరుండు
కానకాళికిఁబంపిన కైకకొడుకు

భర-(ప్రవేశించి) వచ్చుచుండెనుఁ జూడ వానివంద
నములఁగొనుమన్న పావన నామ రామ॥

(నమస్కరించును)

భ-శ—భవదీయసోదరులు వచ్చియున్నారు. తల్లీ! జనకజా వందనములు,

రామ—సోదరులారా! లెండు లెండు. భరతా

చం॥ కుశలమె భూతపేశునకు కోసలభూపతిగర్భజాతకున్
కుశలమె సీమతల్లికిని కోమలలక్ష్మణుగన్నతల్లికిన్
కుశలమె భూసురావళికి కోటపసించెడి సేవకాళికిన్
కుశలమె మామానిచంద్రులకు పూర్తి విహాయిజనాళికెంతయున్

భర—అన్నా! కుశలవార్త తెలుపవిన్నవింతును. మనకుదరింపరాని ఘోరవిపత్తు సంభవించినది. ఇందుకై మనలనొద్దన వేయువారెవ్వరన్నా

రామ—సోదరా! ఏమిది? ఏలవిలపించుచున్నావు

భ—గీ॥ అన్న! వనములవసియింప నరిగ నీవు
తేరు నెక్కిన రెండవ దివసమందు
పుత్రశోకంబుచేతను పొక్కిపొక్కి
తండ్రిదివిజాధిపుఁజేరఁ దరలెనయ్య

రామ, లక్ష్మ, సీత — హా! తండ్రి! (అనిమూర్ఛిల్లుదురు).

భర—సోదరులారా! ఊరడిల్లుడు. అమ్మా చింతదొరంగుము.

రామ—హా జనకా! పుత్రవత్సలా! గాధినందనుక్రతురక్షణార్థము మేమేగినప్పుడే మమ్మువిడనాడి యుండజాలక పోతివిగదా? ఇప్పుడు శాశ్వతముగా మమ్మందరవీడి యెట్లు దివికేగితివి? మాకిక నెవరుదిక్కు. మేముతండ్రిలేని బిడ్డలమైతిమిగదా? అయోధ్యాప్రభు శూన్యమయ్యెను గదా? పుడమికళావిహీనంబయ్యెనుగదా! అదితప్పనియువని నాథుడే గుట దివికిశోభగలిగెనుగదా? తండ్రీ యవసానదశయందు మమ్ము దలచెనా? మాతో నేమైనా చెప్పుమనెనా!

భర—అన్నా! అనసూయమును సేయుచున్నాను. తండ్రిగారిందిక మూడవనాటికి నేవచ్చి తైలఘటనిర్దిష్టుడగువారి కళేబరమునకు దహనసంస్కారము గావించితిని.

రాము—అయ్యో! మీరునుమూవరు తండ్రికి దూరమైతిరా కటకటా! ఎన్నాళ్లకెందా! నావనవాసయానమును భరింపజాలక దివికేగితివా? నాయనా నీకుమరణకాలమున నేనైతినా? కల్యాణగుణములుగల్గియుండియు చింతనొక్కదాని చేనిట్టి సిద్ధిపొందితివా.

[అనుబంధము 9)

భర—అన్నా! ఏలయీపరితాపము. చింతలుడిగి కార్యక్రమమునకు గడంగవలయును.

రాము—సోదరా! నిజము. మనమిప్పుడేమిచేయవలయును.

భర—గురువులగు వశిష్ఠులవారి యనుమతిని జనకుని కుత్తరక్రియలు గావింపవలయును.

వసి—రామా! అదిలెస్స

రాము—చిత్తము. గురువరా. జానకీ! సోదరులారా! రండు మందాకినీతీరంబున కేగి పితృఋణవిముక్తులమై మగుడివత్తము.

అందరు—చిత్తము [పోవుదురు]

శ్రీరామ పాదుకాపట్టాభిషేకము.

సప్తమాంకము-ద్వితీయరంగము-పర్ణశాల.



రా—సోదరులారా! పితృఋణవిముక్తులమైతిమి, గురువరా! అనంతరము.

వసి—రామచంద్రా! ఏమున్నది. పితృఋణవిముక్తుడై తిరి
గనుక నిక పితృపాలనావృతంబగు దేశంబును, దేశజుల కష్టయిష్టం
బులను భరింపఁబూని పరిపాలనకు గడంగవలయును.

రా—అది భ్రాతునివని, సోదరా!

భర—అన్నా!

చం॥ జనపతి యాజ్ఞ యిచ్చెనని సాగితిలక్ష్మణుతో వనాళికిన్
తనపతి పోవుచుండెనని తన్వియువచ్చెను వెంటనంటు దూ
తనయులు కానరేగిరని తండ్రిగతించెనుగాన యింకనా
మనమొంటురాయు చేకొని పాలనసేయుడు ధాత్రిసోదరా॥

రా—భరతా! ఇట్లనదగునా? అవినీతివాదియగునా! రాజ్య
మరాజ్యము గాకింతువా

భ—అన్నా! శ్రీరామచంద్రా! నీవుని కాలత్మణిన ముకుందవై
నారల ధరించి. జటాళిదాల్చి, విల్లమ్ములబూని మౌనివేషాయత్తచిత్తుం
డవై, రక్కసిమూకల యుక్కడగింప నుద్యుక్తుండవై, పితృవాక్పరిపా
లనాసక్తుండవై, కాననాళిని, విరాగులగు బైరాగులచందంబున కాలం
బుపుచ్చుచుండగా, నేను నగరంబున, అమూల్యవస్త్రాలంకార శోభి
తుండనై, నవరత్నఖచిత సింహాసనాసీనుండనై, నిరంతర రాజ్యభోగా
నుభవాసక్తుండనై, వందిమాగధస్తుత్యుండనై పంచభక్ష్యాన్న భోజనుం
డనై కిరీటధారినై రాజ్యంబు సేయగలనా?

రాము—భరతా యివేటిమాటలు? నేనడవినుండగా నీవు రా
జ్యమేలననుచున్నావా? నీవుగాకున్న యింకెవరు నయోధ్యనేలువారు?
నీవిట్లనిన రాజ్యమేమగును

భర—గీ॥ నీవు రాకున్న రాజ్యంబు నిద్రజెందు
ధరణిభారంబు తలదాల్ప తగను నేను
ప్రజలనన్నిటి భువినేలి బడయజాల
రాజ్యమేలంగ రమ్మన్న రామచంద్ర॥ (ప్రణమిల్లును)

రామ—సోదరా! లేలెమ్ము శోకముడిగి ధైర్యమూని

సీ॥ అయోధ్యాపురినినీ వలంకరింపగ నేను
కాననాళికి కీర్తి గాంతు నేను
పురవారలను నీవు పరిపాలనము సేయు
మృగవితతి పాలింతు నయ్య నేను
రాజదండము నీవు రాజవై దాల్చుము
విల్లమ్ములను దాల్చి వెలయు నేను
విలువవస్త్రలదాల్చి మెలగుచుండుము నీవు
నారచీరలదాల్తు నయ్య నేను
తలను రత్నంపు మకుటంబు దాల్పుమీవు
తండ్రియానతి సౌదల దాల్తు నేను
రాజవైనీవు నగరిని తేజరిల్లుము
మౌనిరాజగ నటవిని మనెద నేను॥

భర—అన్నా! యివేటి యూరడింపులు అట్లుగావింప నామన సొప్పునా? వనవాసము నీకు మారు నేగావించెద, నీవేగి రాజ్యమేలుము.

రామ—సోదరా! వనవాసముజేయు తండ్రి నాకాజ్ఞయిచ్చెను గాని నీకీయలేదుగదా కాననవాసంబు నేనేజేయవలయును రాజ్యపరిపాలన నీవుగావింపవలయును. సోదరా! మనము రఘువంశస్థులము, సూర్యవంశశోభితులము, పతివ్రతాగర్భసంజాతులము, సత్యవాగ్దీక్షా ధురంధురులము. పితృవాక్పాలనా వశంవదులము, మనమిట్లు తండ్రి యానతిని మీరి చరింపనెంచుటతగునా? నేను తండ్రిగతించినంత నే యాతనియాజ్ఞలం ద్రోసిపుచ్చి, వనివీకి పురిజొచ్చి ధరణి నేలితినేని లోకులు వక్కసెదు నిందకు మేరకలుగునా? లోకులు మెకది శాంతించియూరకుండినను, ఆముష్మిక సౌఖ్య ప్రదాతయు, సకలైశ్వర్యసంధాతయు దుష్టశిక్షణ శిష్టరక్షణా విచక్షణుండును, లీలామానుషవేషుండును

దు_ర్మార్గపరాయణుండగు భగవంతుడు శిక్షింపకమానునా? ఇవ న్నియు మనకేల! నీవుగావింపు మన్న కార్యము నీతివిరుద్ధము కాదా! కనుక సోదరా అట్టితలంపు లికమానుము.

భర—అగ్రజా! దీక్షవీడజాలను.వా? అట్లైన,

గీ॥ ఇప్పుడేవీకు జొంగనీ। కిచ్చమదిని
గల్గకుండిన మీతోడ। కాననముల
వదియునాలుగు వత్సరాల్। బ్రతుక సెలవు
ప్రేమతోడుత నాకిమ్ము। రామచంద్ర

రామ—తమ్ముడా! ఇది మరింత చక్కగానున్నది నేనడవికిబో రుచుంటినని కర్ణాకర్ణిగా వినినంతనే లక్ష్మణుడు నావెంటవచ్చెను ఇ పుడు నీవిందుండ గోరుచుంటివి మనము ముర్వురమిచ్చుటనే యుండిన శత్రుఘ్నుడు మాత్రమూరికి బోవునా! అతడింకేమియూడును. ఇక రా జ్యమేమగును? ధరణి నెవ్వరుపాలింతురు? ప్రజలేమగుదురు? జనులక ష్టముల నరయువారెవ్వరు? ముఖ్యముగా మన మాతల కెవరుగతి? వా రల నోదార్చువారెవ్వరు? వెర్రివాడా! ఈమాత్రమునకే వంతమునిగి ధైర్యము పోనాడి వీరత్వమును వదలిపెట్టి యిట్లువాపోవం దగునా? రా జ్యాంబరాజకము గావింపదగునా? యిది పొరబాటుకాదా

భర—అన్నా! యింకేమిచేయనగును.

సీ॥ ధాత్రినేలగరాము। తరలింపమ్మనుమని
చిన్నిలక్ష్మణ నీవు 'జెప్పరాదొ!

లక్ష్మ॥ గీ॥ తండ్రి యానతి తలదాల్చి' తరలిమేము
వనములందున వసియింప వచ్చినాము
కాలమంతయు నిందున। క్రమతబుచ్చి
తిరిగి వచ్చెద మందాక' ధరణి నేలు

భర'। సీ॥ వనవాసమునుమాని' మనవేగ వలెనంచు
సీతమ్మ నా తో। జెప్పరాదొ

సీ॥ గీ॥ తండ్రియాజ్ఞ పాలింప । ధర్మము వనిని
పదియు నాల్గేండ్లు వసియింప । బయలుదేర
వాని వెన్నంటి వస్తిమా । ప్రతినదీర్చి
మగుడ నేతెంతు మందాక । మహినియేలు

భర॥ సీ॥ భరతుని వేడికోల్ । నెరవేర్ప వలెనంచు
గురువరా! మీరన్న । గోరరాదొ

వసి॥ గీ॥ దైవసంకల్ప మీయది । దాటరాదు
వీరలడివిని చరియించి । దీరవలయు
నాడు నెన్నది వత్సరాల్ । వీరలిందు
గడిపియే తెంతు రందాక । పుడమి నేలు

భర॥ సీ॥ మాకోర్కె దీర్పుమా । మాయన్న శ్రీరామ
యనుచును శత్రుఘ్ను । డడుగరాదొ

శ॥ గీ॥ జనకుడేగను మమువీడి । స్వర్గపురికి
ప్రభువు లేకున్న రాజ్యంబు । పాడువడును
గాన శాసనవానంబు మానికేగ
నమ్ము పాలింప మాతోడ । రమ్ము రామ

రామ—సోదరులారా! ఏలమీకీ వెర్రి! భరతా! సత్యనిరతా!

గీ॥ జనకు నపకీర్తి జల్లేయ జనకుమయ్య
తల్లి దైవంబటంచును దలపుమయ్య
మేలుగూర్చుచు రాజ్యంబు నేలుమయ్య
అడ్డుచెప్పిన నాయాన అరుగుమయ్య

భర (ప్రణమిల్లి) గీ॥ సోదరా! నీదుమాటపై పోదుపురికి
గాని రాజ్యము నేలగా జాలినాచు
పాలనము జేతు నేనీకు మారుగాను
గాననీగుర్తు నొసగుమో కరుణశాలి

రామచంద్రా! ఎన్నటికైనను రాముడే రాజు. నీవింతగా వాద

డుచున్నావు. గనుక నేఁటోయి, యీవేషముననే సంచరించుచు నీకుమా
రుగా రాజ్యకార్యములను చక్కబెట్టుచుండెదను. కావున నీయానవా
లేదేని యొసంగుము. దానినాభద్రపీఠంబు నందుంచి, నిన్నుగా భావించి
రాజ్యకార్యంబుల చక్కబెట్టుచుండెదను అన్నా ఇందుకాటంకము చె
ప్పవలదు.

వసి— రామా! నీపాదుకల నొసంగుము సంతోషింపవలె

భర— పదివేలు. అంతకన్న వలయునదేమున్నది.

రాము— సోదరా! యివిగో నాపాదుకలు

భర— (కండ్ల నద్దుకొని)

గీ॥ సకల జనముల నానంద సాగరమున
దేల్చజాలిన ధీశాలి ధీరవరుడు
కౌసలేయుడు రాముడు ఘనుడువాని
పాదుకల జతదొరికెనా భాగ్యమహహ॥

రామా! నీవురాకుండ సాకేతపురంబునకు నేజనగజాలను. నీ
పాదుకలం దలదాల్చి నందిగ్రామమునకు జని యందీ పాదుకాద్వయం
బునకు పట్టాభిషేకము గావించి, రాముడే రాజని యెల్లరకు చాటింప
రచి, ప్రతిదినోదయంబునను ముందుగా నీపాదుకలకు నమస్కరించి,
పిదప రాజ్యకార్యంబుల చక్కబెట్టుచు, ప్రతిసాయంసమయంబునను
కార్యక్రమమంతయును పాదుకలసన్నిధిని నివేదించుచుండెదను. నేనద
వినిగాక నగరంబున వసియించుచున్నను, నారలనే ధరించుచు. జటా
లినేదాల్చుచు, ఒంటిపూట భుజించుచు, కటిక నేలను శయనించుచు, నే
విధములైన భోగములనొల్లక యీపదునాలుగువత్సరములు వెళ్ళబుచ్చె
దను. దానికి మీరంగీకరింపవలయును.

రాము— అట్లేచేయుము. రాజ్యకార్యనిర్వహణంబున

సీ॥ అవసరంబెంతయో అంతయేద్రవ్యంబు
పన్నులవల్లగా బట్టవలయు

జనుల కష్టంబులన్ మనకష్టముం జెంది
సుఖము కల్గెడిదారి జూపవలయు
పదవులనీయగా పక్షపాతులేగాని
మతభేదముం ద్రోసి మానవలయు
ఎక్కువతక్కువల్ లెక్కకురానీక
యందరి సమబుద్ధి నరయవలయు
జాతిమతములు చక్కగా సాగవలయు
ఆడువారలు తమ తావు నందవలయు
జారచోరులు మరణించి తీరవలయు
హాయిహాయను రవములు మ్రోయవలయు॥

భర—ఆనందమానందము. రామచంద్రా! నీయాజ్ఞానువర్తినై తప్పక వర్తించెదను, సాధ్యమైనంతవరకు జ్ఞానకృత్యంబుగా నేదోషంబు మరానీక కార్యక్రమము సాగించెదను, అజ్ఞానకృతదోషములను మన్నింప నీవే సమర్థుడవు. నాకిక వెరపేల.

రామ—మంచిదట్లే గావింపుము. నేనీవనంబుల సంచరించుచు దానవాళిని క్రూరమృగంబులను బరిమార్చి సాధుజనులకు సంతసము చేకూర్చెదను. నీవందుండి పౌరులకానందము కలుగజేయుము,

భర—చిత్తము. తప్పక మీరీవనంబులం గల మానిరాజుల రక్షింపుచుండుడు. క్రూరమృగానీకంబును జెండాడుట, రాక్షసానీకంబులను బరిమార్చుట, ధర్మంబును ప్రతిష్ఠించుట, సాధుజనులకు సంతసముంగల్గించుట. ఇవి నీకుగాక యింకెవరికి సాధ్యమగును అందులకే నీకీవనవాసము కల్పింపబడియుండును

రామ—సోదరా! ఇప్పటికి నీకు తత్త్వము బోధపడినది. ఇక నీ వరుగవచ్చును.

భర—అన్నా! ఇంకొక చిన్నవిన్నపము గలదు. పదునాలుగబ్దం

ములను నేనిట్టులో కాలక్షేపముగావించెదను పదునైదవవత్సర ప్రారం భదివసంబున సూర్యోదయమగువరకు నీముఖారవిందసందర్శనము నాకు కన్విందుగావింపనిచో నేనిచ్చబొడ్చి ప్రాణంబులఁ బాసెదను.

రామ — తమ్ముఁడా! తొందరచెందఁబోకుము. పదునాలుగువత్సరంబులు పూర్తిగానించు కాలక్షేపముగావించి మరునాటియుదయమునకే నెట్లయోధ్యకురాఁగలను, ఎటుల రాఁగలనా? కానియొక్కటిమాత్రము చెప్పెదను. నాటికి నేనువచ్చుటగాని వచ్చుచున్నానని వార్తనంపుటగాని గావించెదను. అట్టినాసమాచారముగూట నీకానాటికి తెలియనివడు మున నీయిచ్చవచ్చిన మచ్చునగావింపుము.

భర — చిత్తము

రాము — ఇకనాలసింపక నీవుపురికిబొమ్ము. తల్లులకు మానమస్కృతులర్పింపుము ప్రజలకు హితముగూర్పుము. సేవకాళిం దయతో జూచుచుండుము న్యాయశాలివై కీర్తిగాంచుము. జాగుసేయక బయలుదేరుము.

భర — (పాదుకల శిరమునఁగీలించి)

సీ॥ దశరథసుతుడవై దనరెడు శ్రీరామ
గాధినందను వెంట గన్నరామ
రాతినాతిగఁజేసి ఖ్యాతిగాంచిన రామ
మారీచుబోరిగన్న మాన్యరామ
శివువిల్లుభగ్నంబు జేసిన శ్రీరామ
సీతను బెండ్లాడి చెలగు రామ
తండ్రిదాయానతి తలదాల్చు శ్రీరామ
వనిలోనమానియై మనెడు రామ
అన్న వెనువెంటనడవుల నున్నయట్లు
పూర్ణబలశాలి లక్ష్మణా పుణ్యతముడ

పూతచారిత్ర్యయామాత భూమిజాత

పోవ సెలవిందులో మొద పూజ్యులార!

రా
ల } పోయిరమ్మా.
సీ

వి—అన్నలారా! సెలవు, జనకజా! సెలవు.

రా
ల } మంచిది సోదరా
సీ

రాము—గురువరా! పోయెదము

వశి—శుభంభవతు

భర—సీ॥ శ్రీరామునిటవీడి చేరుచుంటినయోధ్య
కావరే మాయన్న కరుణతోడ
జనకజయౌసాధ్వి వనమందువసియించు
కావరే తల్లి కరుణతోడ
సౌమిత్రినిందుంచి సాగుచుంటిని నేను
కావరే తమ్ముని కరుణతోడ
పదునాలుగేడ్లు వీర్వనమందు వసియింత్రు
కావరే వీరల కరుణతోడ

నగములార! వైకెగరెను! ఖగములార!

జలములార! కొండలనుండు! బిలములార!

దివ్యులార! మీరార్తినను! భవ్యులార!

మానులార! రోదివిన! మామలార!!

(పోవును-తెరపడును)





# శ్రీ రామ పాదుకా పట్టాభిషేకము.

అష్టమాంకము-ప్రథమరంగము:-నందిగ్రామము

ప్రవేశము-పాదుకలను సింహాసనముపైనుంచి భరతుడు-హారతినెత్తుకొనినిలచుండ వసిష్ఠుడు-శత్రుఘ్నుడు చెరియొకప్రక్కనుందురు.

భర—గురువరా

గీ. తండ్రిరామాభిషేకంబు దలచియుండె
కైకనాయభిషేకంబు గనగగోరె
సాంబుడీ పాదుకాభిషేకంబు చేసె
దైవసంకల్పమేరును దాటలేరు

అనుసీతిని జనులకు తేటతెల్లముగావించుటకీ పాదుకాపట్టాభిషేకచరిత్రచాలదా!

వసి—చాలును భరతా! హారతినొసంగుము.

భర—(హారతినిచ్చుచు)

గీ. ప్రభుడవై యున్ననేలుమో బాలరామ
దండమిడెదనునీకిదో దండరామ
మానవులనుబ్రోవుమో పవ మానరామ
రామ! శ్రీరామ! పావన నామరామ

—అనుబంధం 10—

వసి—భరతా! సకల్పసిద్ధుండవైతివి. ఇంకేమి కావలయును

భర—గురువరా! ఏమున్నది. అయినిట్లగుఁగాక

గీ. పాదికల కథ నవ్వారు భక్తి విన్న
వ్రాసి, చదివిన, చూచిన వారలకును
ఆయురారోగ్యవిభవంబు లన్నిగూడ
విందిరావరుఁడే వేళ నిచ్చుగాత

వసి—తథాస్తు! తథాస్తు! తథాస్తు!

మంగళం

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

సమాప్తము.



అనుబంధము. 5

దశరథుడు:—బేహాగ్ త్రిశాల్.

ఎంతటి మోసకారివె। నీవెంతటిమోసకారివె
ఇంత దాపవని। ఎరుఁగనైతినే। వంతముగాని యిటువంటికోరికల
స్వాంతము నందిను। మాంతజాతులకెంతటి॥
మాతృభక్తితప్పరుఁడౌ రామభద్రుండు నీమదికేయపచారములన్
మానక చేసెగా మాన్యుడు సద్గుణ గరిష్ఠుఁడు మాననీయ దేవేశన్ ఘ
న కాంతారము లెఁచరించుట కావలెనే కలమమునో॥ఎంతటి॥

అనుబంధము. 6

రాముడు కన్నడ—ఏక.

ఏమిగతమో తల్లీ॥
నీమనోహరుడు జనకుఁడు నేడేల నిదుల బడియుండె॥ నేమిగతి
రా॥ఏమపరాధము నేనొనర్చితినో ఎందుల మూర్ఛిల్లి నారలో
వేగము తెలుపుము వేడుకొనెదనే॥ఏమి॥

అనుబంధము. 7

రాముఁడు ఫిల్ ఏక.

చింతిలకుమ్మా నాకొరకు మది సంతసమైన॥చింతి
పితృవాక్యపాలనమునకై ప్రీతి నేనరణ్యములకు వెడలిచ్చెదను వేగమె
సెలవిమ్మ॥చింతి॥
నాకై దుఃఖించినా। నాజననికై కనొక్క— న్నాటికి దూషించిన నన్ను తిట్టి
నట్లియగును॥చింతి॥

అనుబంధము. 8

భరతుడు బేహాగ్ రాగము. ఏక

ఎంతటి పాపలోచనమే। నీకెంతటి పాపాలోచనమే।
నింతమైన మదిచింతిలక నీ వెంత ఘోరమ్ము చరించితివో॥ఎంతటి॥

క్రూరజాననవై । కఠర్మరాలవై । కుత్సితమున । నేదూ   కల్పవే
మొన్నవర్చి రామచంద్రా న|రణ్యములకంపితివే ।ఎంత।

అనుబంధము.       9

రాముడు॥ కాళింగడా—ఆట.

హాతడి(డ్రీ । మము బాసినాడవా తండ్రీ।తల్లి కైక కోర్కెలందీ
ర్చ గనీవు తల్లడిలితివా । రామ యనుచు స్వర్గము జేరితివా ।తండ్రీ।

అనుబంధము       10

భరతుడు మాంఢ్. ఆట

రామ పాదుకలివే । శ్రీరామపాదుకలివే పాదుకలను గనివర
మోదము బడసితినిగా నేనా హాహా రామచంద్రుడగు డెంచు సంతసనే
రామపాదముల దలచెదగా।శ్రీరామ।

— గోసాయి చిట్కాలు —

కామరాజు వెంకటరమణశర్మగారిచే వ్రాయబడిన గొప్పవైద్య గ్రంథము. జ్వరములకు, వాతములకు, స్త్రీపురుష సంబంధమైనగు సమస్తవ్యాధులకుఁ శీఘ్రసుఖప్రసవమునకును కొన్ని వందల చిట్కాలు వ్రాయబడిన అద్భుతగ్రంథము. వెల రు 0—8—0

వైరాగి చిట్కాలు.

చిటిక వేయునంతలో మహావైద్యులకుగూడ సాధ్యముకాని గొప్పవ్యాధులను నిమిషములో రూపుమాపునట్టి చిట్కాలిందు వివరింపఁబడినవి. మూలశంకలకు, గర్భవాతములకు, సూతికావాతములకు యిందలి చిట్కాలు పెట్టినది పేరు.

చికిత్సారత్నము.

పురాతన తాళపత్ర గ్రంథములోని శ్లోకములకు పద్యతాత్పర్యములు బాలకవి సింహ వెంకట రాఘవస్వామి గారిచే వ్రాయించి, ప్రచురించినాము. రోగనిరూపణములు, జాతులు, సకలవ్యాధులకుఁ జికిత్సలు విశదీకరింపఁబడిన అమూల్య వైద్యగ్రంథము

షరబత్ పాకావళి.

నృసింహ ధన్వంతరిచే వ్రాయఁబడిన గొప్పగ్రంథము దున్నహము గు వేసవికాలమున షరబత్తులఁద్రాగ నభిలషించు ప్రతివారును దమ గృహములందుఁగూర్చుండియే, వీశేమధనవ్యయము లేకుండ తయారుచేసికొనవచ్చును. 60 షరబత్తుల చేసికొను రీతులిందు వర్ణింపఁబడినవి.

వెల రు 0—6—0

అనుపానమంజరి.

ధవిళేశ్వరపు సోమలింగాచార్యులుగారిచే వ్రాయబడినది.

సమస్తవ్యాధులకు చికిత్సలును, వస్తువుల శుద్ధివిధానములును భస్మములలోని వివిధరకముల దయారుచేయు రీతులును వర్ణింపఁబడిన ఉత్తరగతిలోఁ జేరు వైద్యగ్రంథము. వెల రు 0—8—0

## కొండపల్లి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణ బుక్‌డిపో, రాజమండ్రి

### రసప్రదీపిక.

ఈ పురాతన గ్రంథమునకు ధవళేశ్వరపు సోమలింగాచార్యులు గారిచే తాత్పర్యము వ్రాయఁబడినది రసములశుద్ధిచేయుట, రసవిధములకు విరుగుడుల వ్రాయబడినవి.

### సుఖరోగ చికిత్సలు

దేశమునందెల్లడల చెదలువలె వ్యాపించియున్న వ్యభిచారమునకు ఫలముగా సంభవించు సమస్తవిధములైన సుఖరోగములకును చికిత్సలు వ్రాయబడినయుద్గ్రంథము. అనుభవసిద్ధములగు ప్రక్రియలెన్నోగలవు. శృంగారసామ్రాజ్యమున విహరించు యువకుల కియ్యది మందారవృక్షము. వెల 0—8—0

### అశ్వలక్షణసారము.

మనుమంచిభట్టుప్రణీతము. అశ్వములసుళులు, తిరుగుడులు ఏకాలమున నెట్లుండవలయునో వ్రాయబడినవి అశ్వములలోని భేదములు, ఉపయోగములు వివరింపబడినవి. వేలకువేలు పుస్తకములు విక్రయము. వెల రు. 0—12—0

### శతలేహ్యపాకావళి.

వివిధవ్యాధులచే బలహీనులైన వారలకీ గ్రంథమునం దభివర్ణింపబడిన 100 విధములైన లేహ్యములలో నేది తయారుచేసికొని సేవించినను భీమునివలె బలశాలులగుదురు. ఇది దగ్గరున్నచో రూపాయి మొదలు నూరురూపాయల ఖరీదుగల లేహ్యముల దయారుచేసుకొనవచ్చును. వెల రు 0—8—0

### విషవైద్యము

ఇంతవరకు ఆంధ్రమున నిట్టివైద్యగ్రంథము వెలువడియుండలేదు. పాములలోని జాతులు, తేళ్ళలోని జాతులు, వివరింపబడినవి. పాము, తేలు, జెర్రి, పిచ్చికుక్క, పిచ్చినక్క కాట్లకు మంత్రౌషధ చికిత్సలు ఎన్నో వ్రాయబడినవి. వెల 0—8—0

## రసప్రదీపిక.

ఈ పురాతన గ్రంథమునకు ధవళేశ్వరపు సోమలింగాచార్యులు గారిచే తాత్పర్యము వ్రాయబడినది. రసములశుద్ధి చేయుట, రసవిధములకు విరుగుడులు వ్రాయబడినవి.

## సుఖరోగ చికిత్సలు

దేశమునందెల్లడల చాలగా వ్యాపించియున్న వ్యభిచారమునకు ఫలముగా సంభవించు సమస్తవిధములైన సుఖరోగములకును చికిత్సలు వ్రాయబడియున్నగ్రంథము. అనుభవసిద్ధములగు ప్రక్రియలెన్నోగలవు. శృంగారసామ్రాజ్యమున విహరించు యువకుల కియ్యది మందారవృక్షము. వెల 0—8—0

## అశ్వలక్షణసారము.

మను మాంధాతృప్రోక్తము. అశ్వములరంగులు, తిరుగుడులు ఏ కాలమున నెట్లుండవలయునో వ్రాయబడినవి అశ్వములలోని భేదములు, ఉపయోగములు నిరూపింపబడినవి. వేలకువేలు పుస్తకములు విక్రయము. వెల రు 0—12—0

## శతలేహ్యావళి.

విద్వాంసులచే బహుశ్రుతులైన వారిచే గ్రంథమునందభివర్ణింపబడిన 100 విధములైన లేహ్యములలో నేది తయారుచేసికొని సేవించినను శీఘ్రముగ వీర్యపుష్టి కలుగును. ఇంటనున్నచో రూపాయి మొదలు నూరురూపాయల ఖరీదుగల లేహ్యముల తయారుచేసుకొనవచ్చును. వెల రు 0—8—0

## విషవైద్యము

ఇంతవరకు ఆంధ్రమున విషవైద్యగ్రంథము వెలువడియుండలేదు. పాములలోని జాతులు, తేళ్లలోని జాతులు, వివరింపబడినవి. పాము, తేలు, జెర్రి, పిచ్చికుక్క, పిచ్చినక్క-కాట్లకు మంత్రౌషధ చికిత్సలు ఎన్నోవ్రాయబడినవి. వెల 0—8—0

